డిశంబరు 1948

# చందమామ

వెల 0-6-0

పిల్లల కథల మాసపత్రిక



CHANDAMAMA : CHILDREN'S STORY MONTHLY

ఆబాలగోపాలమునూ
ఆనందముగ్ధులగావించు

నవంబరు **26** నుండి

మద్రాసులో

సాగర్ - లక్ష్మి - గెయిటీ

మూడు థియేటర్లలోనూ

ప్రదర్శింపబడుతోంది.





## జుపిటర్
# మోహిని



ఈ క్రింది కేంద్రములలో దిగ్విజయంగా ప్రదర్శింపబడుతోంది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| కాకినాడ | — | మెజస్టిక్ | మచిలీపట్టణం | — | బృందావన్ |
| రాజమండ్రి | — | జయా | ఏలూరు | — | గోపాలకృష్ణ |
| విశాఖపట్టణం | — | పూర్ణా | భీమవరం | — | వెల్‌కం |
| తెనాలి | — | స్వరాజ్య | గుంటూరు | — | న్యూ సిటీ |

చిత్తూరు — ప్రేమల

చందమామ

ఈ సంచికలో యివి

చదువుకోండి



ఇవన్నీక చిక్కు చదరాలు, ముగ్గులు, చిక్కు బొమ్మలు, జోలపాటలు, పజిలు, ఇంకా ఇంకా ఎన్నోవున్నై.

చందమామ ఆఫీసు
పోస్టుబాక్సు నెంబరు. 1686
మద్రాసు. 1.

# తండ్రి-కొడుకులు



పై పుస్తకము చందమామ ఏజెంట్లవద్ద దొరుకుతుంది. అలా దొరకకపోతే తెప్పించి యిమ్మని అడగండి. మీకు 0-8-0 లకు దొరుకుతుంది. లేక మేము పంపితే పోస్టుఖర్చులతోసహా 0-12-0 అవుతవి. కాబట్టి, పుస్తకం కావలసినవారు ఆరుగురు కలిసి రు. 3-0-0 పంపితే పోస్టుఖర్చులు మేమే భరించి మీకు పుస్తకాలు ఆరూ పంపుతాము.



చందమామ పబ్లికేషన్సు
పోస్టు బాక్సు నెం. **1686** : మద్రాసు - 1.

డిశంబరు 10-వ తేదీన ఆంధ్రదేశమంతటా విడుదల !




వరలక్ష్మి, లక్ష్మిరాజ్యం, ప్రకాశరావు, ప్రసాద్, రాళ్లబండి నటించినది.

ఆంధ్ర, దత్తమండలాలకు డిస్ట్రిబ్యూటర్లు :

ప్రీమియర్ ఫిలిమ్స్ లిమిటెడ్ - బెజవాడ.




సంపుటి [illegible]
సంచిక 6

సంచాలకుడు : చక్రపాణి

[illegible]
1948

## కుంభకర్ణుడి యుద్ధం

పాపాయిలూ! మీరు ఇదివరకు ఒకమాటు కుంభకర్ణుణ్ణి గురించి విన్నారుకదూ! అతను ఆరునెల్లు మేలుకుంటాడనీ, ఆరునెల్లు నిద్రపోతాడనీ, కొన్ని బళ్ల ఆహారం తింటాడనీ, కొన్ని పీపాల మద్యం తాగుతాడనీ. ఇదంతా జ్ఞాపకముందా?

కుంభకర్ణుడు వృత్త తిండిపోతు కాదు. మహా బలశాలి. కొండలను పిండి చేయగలడు. అతను పట్టుకొనిలాగితే ఎంత గొప్ప వృక్షమైనా భూమిలోనించి పెళ్లగిలి రావలసిందే. ఇక వాటిని కొన్ని యోజనాల దూరం విసిరి పారవేయ గలడు.

కుంభకర్ణుడు సరిగ్గా నిద్రపోయి లేస్తే అతన్ని జయించే వాడు ఈ ప్రపంచములోనే లేడు. అందుకనే విభీషణుడు రాముడితో చెప్పి కుంభకర్ణుడు నిద్రపోతున్న సమయంలో యుద్ధం మొదలుపెట్టించాడు. రావణుడుకూడా కొంతకాలం కుంభకర్ణుణ్ణి నిద్రలేపకుండానే యుద్ధం సాగించాడు. కాని అతనివల్ల కాలేదు. కొడుకు లందరూ చచ్చిపోయారు. ఇక కుంభకర్ణుడు తప్ప అతనికి దిక్కు కనిపించలేదు. విధిలేక నిద్రపోతున్నవాడిని లేపించాడు.

కుంభకర్ణుడు అర్ధనిద్రలో లేచాడన్నమాటేకాని అతనికి పూర్తిగా మెలకువ రాలేదు. సగం కళ్లు మూసుకునే యుద్ధం చేశాడు. అతని చేతిలో ఎన్నో లక్షల వానరులు చచ్చారు. తక్కినవారు భయంతో వణికిపోతూ, రాముని వెనక దాగుకొన్నారు. కుంభకర్ణుడు రామునిమీదకు తలపడ్డాడు. రాముడు ఊపిరాడకుండా బాణాలు వేసినా, వాటిని లెక్క చేయలేదు. ఇది పనికాదని రాముడు వాయువ్యాస్త్రం వేసి, కుంభకర్ణుడి కుడిచేతిని, గదతో సహా పడకొట్టాడు. కుడి చేయి పోతే ఎడమ చేతితో యుద్ధం సాగించాడు కుంభ కర్ణుడు. అదీ పడకొట్టాడు రాముడు. కాళ్లతో పోరాడినాడు కుంభకర్ణుడు. కాళ్లుకూడ తెగవేశాడు రాముడు. పొడుగు పాటి నాలిక చాపి, గుహవంటి తన నోట్లోకి వానరసైన్యాలను లాగుకొన్నాడు కుంభకర్ణుడు. ఆఖరుకు రాముడు ఆగ్నే యాస్త్రం ప్రయోగించి అతని తలా మొండెమూ వేరుచేశాడు.



పాపాయిలూ !— మీ కిప్పుడు ఒక చిత్రమైన జపానుకథ చెబుతాను. ఈ కథ జరిగేనాటికి, జపానువాళ్లు అద్దం చూచుకోవటమే ఎరగరు!— మరి అద్దం చూచుకుంటేగాని, లేకపోతే మన ముఖం ఎలాగున్నదీ మన కెట్లా తెలుస్తుందీ? అందుకని, వాళ్ళ ముఖం ఎలా వుంటుందో వాళ్ళకి తెలిసేదే కాదు.

అటువంటి జపానుదేశంలో— ఒక వూళ్లో ఒక రైతు వుండేవాడు. ఒకనాడు అతను బజారుకు పోతూవుండగా దార్లో ఒక అద్దంముక్క దొరికింది. దాన్ని ఎత్తి చూశాడు. చూచేసరికి, ఏముంది? అందులో అతని రూపం కనపడింది. కాని- అది తన రూపమే అన్న సంగతి రైతుకి తెలియదు.

'ఎవ్వరీ మనిషి ? నా వేపు ఎందుకు చూస్తున్నాడు? ఇతను ఎవరై వుంటాడు?' అని ఆశ్చర్యంతో చాలా సేపు ఆలోచించాడు. ఆలోచించి, చివరకు 'ఇతను మరెవరూ కాదు. నా చిన్నతనంలో చచ్చిపోయిన మా నాయన అయివుంటాడు' అని నిశ్చయించుకున్నాడు. 'ఐనా ఇంత కాలమైన తరవాత, ఇప్పుడీ రూపంతో ఎందుకు కనబడుతున్నాడు? నేను తనని మరచిపోయానని ఏమైనా కోపం వచ్చిందేమో? నాకు ముఖాముఖిని కనిపించి బుద్ధి చెప్పా లనుకున్నాడేమో ?'—ఇలా అనేక విధాల తలుచుకుని, తను చేసిన తప్పుకు లెంపలు వేసుకున్నాడు.

అయితే యిప్పుడు మరి నాయన్ను ఏం చేయాలి ? మళ్లీ పారవేయాలా? పారవేస్తే ఆయనకు ఏంకోపం వస్తుందో? ఏం చేస్తాడో ? అని భయపడి ఆ అద్దపుముక్కను తన జేబురుమాల్లో చుట్టి, జాగర్తగా ఇంటికి తెచ్చి పెట్టెలోపెట్టి తాళం వేశాడు. తాళం వేసినవాడు అంతటితో వూరుకున్నా పోయేది. ఇంటో భార్య లేకుండా చూసి, రోజుకు ఒకటి రెండుసార్లు వాళ్ళ నాయన వున్నాడో లేడోనని చూచుకుని మళ్లీ తాళం వేసేవాడు.

సంపాదన: ఎ. నాగభూషణరావు, దుద్దుకూరు




ఇలా వుండగా ఒకరోజున ఇది అతని భార్య కంటపడింది. ఎన్నడూ పెట్టెకు తాళం వెయ్యనివాడు తాళం వెయ్యటమూ, తను లేనప్పుడు పెట్టె తెరిచి చూచుకోవటమూ ఆమెకు అనుమానం కలిగించినై. అందులో అతను ఏదో దాచివుంటాడని ఆమె నిశ్చయించుకుంది. మారుతాళం చెవి ఒకటి సంపాయించి భర్త యింటో లేనప్పుడు పెట్టె తెరిచి చూసింది. చూస్తే ఆమెకు మాత్రం కొత్తది ఏమి కనిపిస్తుంది, ఆ అద్దంముక్క తప్ప? 'ఓశ్! ఇదేనా, భాగ్యం?' అని తీసి చూసుకుంది! చూడగానే ఆమెకు ఆడపిల్ల కనిపించింది. తన భర్త ఇంతకాలం దాచుకు చూస్తున్నది, ఒక పరాయిపిల్ల బొమ్మనా? ఈ సంగతి తెలిసేవరకు ఆమెకు కోపం వచ్చింది. మొహం అంతా ముడతలు పడింది. మళ్లీ అద్దంలో చూచింది. అందులో మొహం ఆమెకు అసహ్యంగా కనిపించింది? ఇలాంటి ఛండాలపు మొహందానినా తన భర్త ప్రేమించింది? ఆమెకు కోపం పెరిగిన కొద్దీ అందులో మొహం అసహ్యంగా కనిపించింది, ఇక ఆమె వుండలేకపోయింది. భర్త ఎప్పుడు ఇంటికి వస్తాడా? ఎప్పుడు తను అడగవలసిన నాలుగు మాటలూ అడిగేసి పుట్టింటికి పోదామా? అని కని పెట్టుకు కూచుంది.

మధ్యాహ్నం భర్త వచ్చాడు. అతను ఇంటో అడుగు పెట్టగానే ఆమె— "నేను మా పుట్టింటికి పోతున్నాను – నువ్వు నీ వుంపుడుగత్తెను తెచ్చుకుని ఈ యింటో ఊరేగు. నాకేం పట్టలేదు!" అన్నది ఫెడీమని.

పాపం! ఈమె మాటలు మొగుడి కేమీ అర్థంకాలేదు. అతను ఎంతోసేపు బ్రతిమాలాడు సంగ తేమిటో చెప్పమని. చివరకి ఆమె అద్దం సంగతి బయటపెట్టింది.

"అద్దంలో ఆడమనిషి వుందా? మా నాయన కాదూ?" అన్నాడు మొగుడు.

"మీ నాయనా? ఇంకా నయం, మీ తాత అని చెప్పలేదు! మళ్లీ కళ్లు కడుక్కొని ఒకమాటు చూడు!" అంటూ పెళ్లాం పోయి అద్దం తెచ్చియిచ్చింది.

రైతు మళ్లీ చూచుకున్నాడు. చూస్తే ఏముంది? అందులో అతని మొహమే కనిపించింది. అతను సంతోషంతో 'ఇదుగో, చూడూ! ఇందులో వుంది మా నాయనే!" అని అద్దం మళ్లీ భార్యకు యిచ్చాడు.

ఆమె చూసుకుంటే ఏముంటుందీ? మళ్లీ తన మొహమే కనిపించింది. ఆమె ఇక కోపం పట్టలేక అద్దంముక్క అవతల వేసి పుట్టినింటికి బయలుదేరింది. మొగుడు అద్దంముక్క తీసుకుని బతిమాలుతూ ఆమె వెంటపడ్డాడు. ఇతను ఎంతచెప్పినా అమె నమ్మటంలేదు.

ఇద్దరూ వూరిబయటికి వచ్చేశారు. ఆ దారినే ఒక మతగురువు వస్తున్నాడు. 'మన యిద్దరం కలిసి గురువుగారు చెప్పినట్టు విందా'మన్నాడు మొగుడు. భార్య ఒప్పుకుంది. ఇద్దరూ కలిసి గురువుగారికి తమ తగువు సంగతి చెప్పారు. గురువుగారు అంతా విని అద్దంలో చూశారు. అతనికి వారు చెప్పుతున్న ఇద్దరూ కనిపించలేదు! ఎవరో ముసలివాడు జాలిగా చూస్తున్నట్టు కనిపించాడు. నిరుడు ఈయన ఒక ముసలి



వాడికి ఉరిశిక్ష చెప్పాడు. బహుశా ఈ ఆకారం అతనిదేమో ననుకున్నాడు.

"అర్థంలేకుండా మీ రిద్దరూ పోట్లాడకండి. ఈబొమ్మ ఎవరిదనుకుంటున్నారు?- మీరు చెప్పిన ఇద్దరిదీ కాదు. నిరుడు నేనొక మనిషికి ఉరిశిక్ష చెప్పాను. అతనిది ఈ బొమ్మ. అతడే ఇందులో జాలిగా నా వేపు చూస్తున్నాడు" అంటూ వారిని దీవించి పంపి, గురువుగారు ఆ అద్దపు ముక్కను చేతపట్టుకు చక్కాపోయాడు.

గురువుగారు చెప్పిన తీర్పుతో, ఇంక దంపతుల మధ్య తగువు తెగిపోయింది. అప్పటినించీ వారు ఏ పేచీ లేకుండా హాయిగా కాపరం సాగిస్తూ వుంటున్నారు.



# జమ - ఖర్చు

పాలమ్ముకొనే పోలయ్యా
పాడిగేదెలను గొనబోతు
చిత్తెండకు తెపతెపలాడీ
చెఱువుగట్టుపై చేరాడు.
ముల్లెమూట నొడ్డున బెట్టీ
మోటు చెప్పులట దిగవిడచి
చలిదిమూట నొకచే బట్టీ
చల్లగ రేవుకు దిగినాడు.
ఆకటి తొందరచే నేమో?
పైకము సంగతినే మఱచి
చలిదిమూట కటునిటు నీళ్లా
చిలుకుతు లొట్టలు గొడుతుంటే
పోటుమట్టిపై కోతొక టా
మూట నెత్తుకొనిపోయింది.
పోలయ లబలబ లాడుతునే
రాలు రప్ప లటు రువ్వాడు;
కొమ్మ కొమ్మ కెగబ్రాకుతు నా
కోతియు కిచకిచ లాడింది.
కడ కొతని కేది తోచిందో
గట్టున చతికిలబడ్డాడు.
చలిదిమూట విడదీస్తూనే
తొలి ముద్దొక టటు విసరాడు.

రచన :

## ఏటుకూరి

కోతి యదేమో స్తరు చేసీ
మూట ముడుచుకొని కూర్చుంది;
ఆదమఱచి మన పోలయ్యా
ఆవలిముద్ద నిటు విసరాడు;
అది తపుక్కు మని నీళ్ళల్లో
అనుకోకే పడిపోయింది.
ఇక కో తేమని చెప్పేది?
ఇటునటు రూకలు విసరింది;
గుబగుబ శబ్దము వింటుంటే
కోతికి హుషారు హెచ్చింది;
బుడబుడ మునింగి పోతుంటే
పోలయ కేడుపు వచ్చింది.
నీట బయట చెరిసగముగ నా
మూట సాంతమయి పోగానే
పోగా మిగిలిన వేరుతు మా
పోలయ యిట్లనుకొన్నాడు:
"పాలు, నీళ్ల చెరిసగముగ సం
పాదించిన పీ రూపాయల్
నీళ్లవి నీళ్లకె దక్కినవీ
నీచానికి తలపడరాదు;
పాలవి పాలకె దక్కినవీ
పాడు సొమ్ము కేడువరాదు."






















పాపాయిలూ! పైన మొత్తం తొమ్మిది పిల్లులున్నాయి, చూచారుకదా? అవి అన్నీ చూడటానికి ఒకేమోస్తరుగా వున్నాయి. కాని నిజానికి, అలాలేవు. అందులో రెండు పిల్లులు కొంచెం తేడాగా వున్నయి. ఆ తేడా లేకపోతే అన్నీ ఒకటే నన్నమాట. మరి, ఆ తేడాగా ఉన్న పిల్లులు రెండూ ఏవో కనుక్కోండి మీరుకనుక్కో లేకపోతే జవాబుకి చివరి పేజీలలో చూడండి.




[గతసంచిక తరువాయి]

ఈసారి "బుల్లిపాప" పెట్టెను ఇంకా అందంగా అలంకరించారు. అందులో చిత్పల తన బొమ్మల తొట్టికూడా పెట్టి ఆ తొట్టిలో వర్ధమానుణ్ణి పడుకోబెట్టింది. ఇట్లా చెయ్యటంవల్ల వర్ధమానుడి ప్రయాణం కొంతవరకు సుఖంగా జరిగింది. రైతు గుర్రం ఎక్కాడు. రైతు వెనకగా, చేతిలో పెట్టె పట్టుకుని, చిత్పలకూడా ఎక్కింది. గుర్రంబయలు దేరింది. బుల్లిపాప ఎక్కడ నలిగిపోతాడో అని చిత్పల దారిలో అనేక చోట్ల, తనకు ఆయాసంగా ఉందని వంక పెట్టి, తండ్రిచేత మజిలీలు వేయించింది.

రైతు మొత్తంమీద చాలా గడుసువాడు. దారిలోనూ దారికి కాస్త ఎడంగానూ తగిలిన ప్రతి గ్రామంలోనూ ఆగి వర్ధమానుడిచేత ప్రదర్శనాలిప్పించి రెండుచేతులా బోలెడంత డబ్బుచేసుకున్నాడు. ఈ ధనాశ మూలంగా ఆ రైతు వెనకటిమాదిరిగా వర్ధమానుడి కష్టసుఖాలు పాటించటంకూడా మానేసి తన డబ్బే చూచుకోసాగాడు. ఈ కారణంచేత వర్ధమానుని ఆరోగ్యం చెడి అతను నలితగానూ, బలహీనంగానూ తయారై, జాలిగొలిపేటట్టు కనపడటం మొదలుపెట్టాడు. అయితే రైతుకు వర్ధమానుడి వాలకంచూసి జాలికలగకపోగా చిరాకు వేసింది. చచ్చిపోతాడేమో, వచ్చే లాభమంతా పోతుందేమోనని భయంకూడా కలిగింది. ఇంకా చాలా గ్రామాల్లో ప్రదర్శనాలివ్వవలసివుంది కదూ.

"అయ్యో, బుల్లిపాపా! నీ ఆరోగ్యం బాగాలేదు. చచ్చిపోతావే ఏమిటో! నేను సంపాదించే డబ్బంతా సంపాదించేలోగా చచ్చేవు సుమీ!" అన్నాడు రైతు వర్ధమానుడితో. రాచనగరు చేరకపూర్వమే రైతు

జోనాథన్ స్విఫ్టు వ్రాసిన 'గల్లివర్స్ ట్రావెల్సు'కు అనుకరణ

చాలా డబ్బు చేసుకున్నాడు. ఆఖరుకు రాచనగరు చేరారు.

పట్టణంలో అనేకచోట్ల వర్ధమానుణ్ణి ప్రదర్శించటానికి ఏర్పాట్లు జరిగాయి. రైతు ఈ ప్రయత్నాలలో నిమగ్నుడై ఉండగా జనానాలో రాణీగారూ ఆవిడ చెలికత్తెలూ "బుల్లిపాప"ను చూడటానికి తహతహలాడుతున్నారనీ, వెంటనే వచ్చి అక్కడ ఒక ప్రదర్శనం ఇవ్వవలసిందని రాజభటులు కబురు తెచ్చారు.

"నాపంట ఈనాటికి పండింది." అనుకున్నాడు రైతు. అతను ఈ మహాభాగ్యం కోసమే ఇన్నాళ్లూ కాచుకుని ఉన్నాడు. రాణీగారి పరివారం ఎదట బుల్లిపాపను ప్రదర్శించినందుకు ఎంత బహుమతి దొరుకునా అని రైతు ఆలోచించసాగాడు.

వర్ధమానుడికి తన యజమానిమీద ఇప్పుడు అవగింజంత అభిమానంకూడా మిగలలేదు. ఆ రైతుకు డబ్బుచేసిపెట్టలేక అతని ప్రాణం విసిగిపోయింది. ఈ ప్రయత్నంలోనే తన చావు రాసిపెట్టి వుందని వర్ధమానుడు నిశ్చయం చేసుకున్నాడు.

రైతు వర్ధమానుణ్ణి పెట్టెలో పెట్టుకుని చిత్పలను వెంటబెట్టుకుని సాధ్యమైనంత



వేగంగా రాణీగారి అంతఃపురానికి వెళ్లాడు. రాణీగారి ముందు రైతూ చిత్పలాకూడా వొంగి నమస్కారాలుచేసి బుల్లిపాపను చూపారు. అతన్ని చూడగానే రాణీకి చాలా ముచ్చటయింది.

"నువు చూడటానికైతే చాలా ముద్దొస్తున్నావుగాని ముద్దుగా మాట్లాడటం కూడా నీకు చాతనవునా?" అని రాణి వర్ధమానుణ్ణి అడిగింది.

"తమ భాష నాకు కొద్దిగా వచ్చును," అని వర్ధమానుడు రాణీగారికి తగినట్టుగా మాట్లాడి, ఆమె దర్శనంవల్ల తన జన్మ ధన్యమయిందన్నాడు. ఈ మాటలువిని రాణీ మరింత మురిసిపోయి, "ఈ పాపను వెయ్యి మొహర్లకు అమ్ముతావా?" అని రైతు నడిగింది.

బుల్లిపాప ఇంక ఎంతో కాలం బతకదని రైతు అదివరకే నిశ్చయం చేసుకున్నాడు. అందుచేత వెయ్యి మొహర్లకు అతన్ని వదిలించుకోవటం రైతుకు చాలా సంతోషంగానే ఉంది. కాని పైకి తన కెంతో కష్టంగా ఉన్నట్టు నటించి చివరకు ఒప్పుకున్నాడు.

"ఏం, బుల్లిపాపా? నీ యజమానిని వదిలి నాదగ్గిర ఉండిపోతావా?" అని రాణీ వర్ధమానుణ్ణి లాలించి అడిగింది.



"అంతకన్న మహాభాగ్యమా? అయితే ఈ చిత్పలనుకూడా నాదగ్గిర ఉంచగలరా? ఆమెను విడిచి ఉండలేను," అన్నాడు వర్ధమానుడు.

"చిత్పల నీదగ్గిరే ఉంటుంది. ఆమెను కూడా నేనే పోషిస్తాను," అన్నది రాణీ. ఈమాటకు రైతుకూడా సంతోషించాడు; తన కూతురి పంటకూడా పండిందను కున్నాడు. అతను రాణీగారిదగ్గిర సెలవు పుచ్చుకుని ఈ శుభవార్త భార్యకు చెప్ప టానికి బయలుదేరాడు.



వర్ధమానుణ్ణి జాగ్రత్తగా తన అరిచేతిలో పెట్టుకుని రాణీ తిన్నగా రాజుగారి దగ్గిరికి వెళ్లింది.

"ఇటువంటి వింత ఎక్కడన్నా చూశారా?" అన్నది రాణీ, వర్ధమానుణ్ణి రాజుకుచూపి. రాజుగారి ఆశ్చర్యానికి మేరలేదు.

"ఎవరు నువు? ఎక్కడినుండివచ్చావు? ఏమిటి నీ వృత్తాంతం?" అని రాజుగారు వర్ధమానుణ్ణి అడిగాడు. వర్ధమానుడు తన కథ యావత్తూ చెప్పగా విని రాజు మరింత ఆశ్చర్యపడ్డాడు.

వర్ధమానుడికి అన్నిరకాల రాజభోగాలూ జరిగాయి. చిత్పల ఎప్పుడూ అతనిదగ్గిరే ఉండేది. అతనికోసం రాణీ చక్కనిపెట్టె చేయించి, దానికి అన్నిప్రక్కలా మెత్తలూ, వాకిళ్లూ, కిటికీలూ, అలమరులూ, అరలూ ఏర్పాటు చేయించింది. అందులోనే కుర్చీలూ, బల్లలూ, ఒక మంచంకూడా అమర్చారు.

అతనికోసం కమసాలివారిచేత బుల్లి వెండి పళ్లాలు చేయించారు. రాణీగారు భోజనంచేసే సమయంలో వర్ధమానుడు కూడా తన చిన్న పళ్లాలలో భోజనం చేసే వాడు. అతను భోజనం చేస్తుంటే చూడటం రాణీకి చాలా ముచ్చటగావుండేది.

ఒకనాడు భోజనాలవేళ వర్ధమానుడికి పెద్దగండం తప్పింది. అది ఎట్లా జరిగిం



దంటే—రాణీదగ్గిర ఒక మరుగుజ్జువా డుండేవాడు. వాడుకూడా వర్ధమానుడి కంటె అయిదురెట్లు ఎత్తుండేవాడు. ఈ మరుగుజ్జువాడు ఎవరూ చూడకుండా వర్ధమానుణ్ణి పట్టుకుని ఎత్తి నేతిగిన్నెలో వేసి ఘనకార్యం చేసినవాడల్లే కేరింతాలు పెట్టి నవ్వుకుంటూ పారిపోయినాడు. కొన్ని క్షణాలపాటు రాణీ, చిత్పలాకూడా విస్తు పోయి ఏమీ చెయ్యలేక పోయినారు. ఆ తరవాత చిత్పల అతన్ని రక్షించి పైకి తీసింది. వర్ధమానుడికి ఈత చాతకాపటం వల్ల ప్రాణం దక్కింది. అప్పటికీ అతను చాలా నెయ్యి మింగి కొంతసేపటివరకూ తేరుకోలేక పోయినాడు.

ఆ తరవాత ఆ మరుగుజ్జును పట్టుకుని మెత్తగా తన్నారు. ఈ తన్నులు వాడికి వెనకనే తగిలివుండవలసింది. ఎందు కంటే కొంతకాలం క్రితం ఒకసారి భోజ నాల దగ్గిర ఈ మరుగుజ్జే వర్ధమానుణ్ణి ఒక ఎముకలో నడుమువరకూ దూర్చాడు. అప్పుడు మరుగుజ్జుకు శిక్షపడకుండా వర్ధమానుడే అడ్డపడ్డాడు. కాని ఈ తప్పుతో మరుగుజ్జుకు ఉద్వాసన అయింది.

వర్ధమానుడు అంతఃపురంలో రెండు సంవత్సరాలు గడిపాడు. అతనికి మహా వైభవంగా జరిగింది. కాని ఈజీవితం అతనికి తృప్తికలిగించలేదు. ఈ రాక్షసుల దేశంనుంచి ఎట్లా తప్పించుకుని తన సాటి మానవులమధ్య స్వేచ్ఛగా జీవింతామా అని అతను ఆరాట పడసాగాడు.

ఇట్లా ఉండగా రాజూ, రాణీ ఒకసారి సముద్రతీరానఉన్న ఒక గ్రామానికి రాచ కార్యంమీద వెళ్లవలసివచ్చింది. రాణీ వెంట చిత్పలా, తన పెట్టెలో వర్ధమానుడూ కూడా వెళ్లారు. ఆ ప్రయాణంవల్ల చిత్పలకూ వర్ధమానుడికీకూడా చాలా బడలిక అయింది.

"నాకు శరీరంలో ఏమీ బాగాలేదు. ఒక్కసారి సముద్రపుగాలి తగిలితే

బాగుండును!" అన్నాడు వర్ధమానుడు. కనీసం సముద్రంచూసి అయినా సంతోషింతామని అతని ఆశ.

చిత్పల అతన్ని వెంటపెట్టుకుని వెళ్లే స్థితిలో లేకపోవటంవల్ల ఆమె, ఒక నౌకరు కుర్రవాడికి బుల్లిపాప పెట్టె ఇచ్చి, జాగర్తగా కాపాడమని ఎంతో గట్టిగా చెప్పి పంపింది.

కాని ఆ నౌకరు కుర్రవాడికి ఏమీ బాధ్యత తెలియదు. వాడు వర్ధమానుడి పెట్టెను సముద్రతీరాన రాళ్లమీద ఉంచి పక్షులగుడ్లు దొంగిలించటానికి వెళ్లిపోయాడు.

ఈ సమయంలో ఒక గద్దవచ్చి వర్ధమానుణ్ణి పెట్టెతోసహా కాళ్లతో తన్నుకుని సముద్రంమీదికి ఎగిరిపోయింది.

"బుల్లిపాప"ను సముద్రం అలలు మింగేశాయని చిత్పలా, రాణీ అనుకుని దుఃఖించారు. కాని నిజానికి వర్ధమానుడు సముద్రంలో మునిగిపోలేదు. అతన్ని తన్నుకుపోయిన గద్ద సముద్ర మధ్యంలో అతని పెట్టెను జారవిడిచింది.

ఆ పెట్టె చాలాసేపు అట్లాగే నీటిమీద తేలుతూ ఉండి దూరంగాపోయే ఒక ఓడ కంటపడింది. ఆ ఓడయజమానులు వర్ధమానుణ్ణి రక్షించి అతని సమాచారం తెలుసుకుని అతన్ని వాళ్లదేశం చేర్చారు.

ఆ తరవాత వర్ధమానుడు దేశాలు తిరగటం మానివేసి పెళ్లాడి పిల్లల్నికని వ్యాపారం చేసుకుంటూ సుఖంగా బతికాడు. అతని బిడ్డలూ, మనమలూ ఎప్పుడూ అతనిచేత ఈ వింతవింత విషయాలు చెప్పించుకుని ఎంతో ఆశ్చర్యపడుతూ వినేవారు. వర్ధమానుడి అనుభవాలు మీకుమాత్రం ఆశ్చర్యకరంగా లేవూ?

(అయిపోయింది)






కపిలపురంలో ఒక బ్రాహ్మణు డున్నాడు. అతనికి వరసన అందరూ ఆడపిల్లలే, పుట్టారు. అందుచేత, అతను ఎప్పుడున్నూ పుత్రుడో పుత్రుడో అని కలవరిస్తూ ఉండేవాడు.

చివరికి అతనికోరిక నెరవేరింది. నలుగురు ఆడపిల్లల తరవాత వరప్రసాదమా అన్నట్టు, ఐదోసారి ఒక మగపిల్లవాడు కలిగాడు. లేకలేక కలిగిన ఈ పిల్లవాణ్ణి చూచుకుని,— ఆ దంపతులు చెప్పతరం కాని ఆనందం పొందుతూవున్నారు.

పిల్లవాడు ఏం కావాలన్నా సరే, అడగటమే తడవుగా ఎదట పెట్టేవారు. ఇలా గారాబంగా పెరగటంవల్ల వాడికి మకురుతనం ఎక్కువయింది. ఎప్పుడయినా వాడు అడిగింది తేలేకపోతే ఇంటిపెంకులు ఎగిరిపోయేటట్టు పోరుపెట్టేవాడు. మక్కువ కొద్దీ, ఎవళ్లైనా తనని ఎత్తుకోబోతే, వాళ్లనీ రక్కి, గిల్లి, పీకి పాకంపెట్టేవాడు.

ఇలా, అల్లరితోటీ అగడాలతోటీ అబ్బాయికి అయిదోయేడు వచ్చింది. వైభవంగా అక్షరాభ్యాసం జరిగింది. పిల్లవాణ్ణి బళ్లో వేశారు. బళ్లో మనవాడు చేసేపని యేమిటీ అని అడుగుతారేమో!— పలకలు, బలపాలు, పుస్తకాలు దొరికినమట్టుకి దొంగిలించటం; పంతులుమొహం చాటయితే సరి, అవతలకు పోయి తొక్కుడుబిళ్ళ, దాగుడుమూత, చెడుగుడు, గోలీకాయలాటలు; ఆటల్లో అందరినీ తన్నుతూ ఉండటం. పంతులు వచ్చేవేళకు ఏమీ ఎరగనివాడిలా కుదురుగా కూర్చోవటం. ఇవీ వాడి చేష్టలు.

కుర్రవాడికి దుడుకుతనం రోజు రోజుకీ ఎక్కువై పోతున్నది. వీడినిగురించి తక్కిన పిల్లలు కూడా చెడిపోతున్నారు. అందుచేత, పంతులు వీణ్ణి బడినించి యింటికి పంపించివేసి, మరెక్కడయినా చదువు

మంగళగిరి వెంకయ్య, నెల్లూరు




చెప్పించుకోమని కుర్రవాడి తండ్రికి జాబు రాసి పంపాడు. ఇక విధిలేక మనవాణ్ణి తండ్రి, పక్కనున్న ఒక చిన్న పల్లెటూరిబళ్లో వప్పగించి, పంతులింట్లోనే బస ఏర్పాటు చేశాడు. స్థలం మారింది, పంతులూ మారాడు. కాని, అబ్బాయి బుద్ధి మాత్రం మారలేదు.

ఈ కొత్తపంతులు మనవాణ్ణి నమ్మి బడి పెద్దగా వుంచాడు. ఇంకేం, వాడు ఆగడానికి తోడు అధికారం కూడా చెలాయించటం మొదలెట్టాడు, తోడి పిల్లలమీద. ఈ గోల పడలేక, పంతులు ఆకతాయిని బడికి పోనీకుండా ఇంటిదగ్గరే నిలిపివేశాడు.

ఇంట్లోమాత్రం మనవాడు ఊరికే ఉంటాడా?- ఒకనాడు పంతులు తల్లి, బియ్యం దంపుతూ వుంది. "నాయనా, ముసలిదాన్ని, కాస్తంత సాయంచెయ్యరా" అన్నది. ఆకతాయి సరేనని ఒకసారి రెండుసార్లు సరిగ్గానే పోటువేసి, మూడోసారి అవ్వ వేలు పచ్చడయ్యేటట్టు వేశాడు.

మరునాడు గురువుగారు మనవాణ్ణి అప్యాయంగా పిలిచి, "నాయనా! నాకు కొంచెం రొంపభారంగా వుంది. దబ్బున కాసిన్ని వేడినీళ్లు కాగబెట్టగలవుటోయ్?" అన్నారు. ఆకతాయి గబగబవెళ్లి గురువుగారి తాటాకు గ్రంథా లన్నీ పొయ్యిలో వేసి మంటబెట్టి, నిమిషములో నీళ్లుకాగబెట్టాడు.

శిష్యుడి ప్రజ్ఞకి గురువుగారు సంతోషించారు. స్నానం అయినతర్వాత ఆయన దేముడి గదిలోకి వెళ్లి తీరా వెతుక్కుంటే, పారాయణపుస్తకం ఒక్కటీ అగపడదు. పంతులకి గుండె నీరయిపోయింది. "చాలుబాబూ నీ శిష్యరికం'అని అనుకొని, తక్షణమే వాణ్ని తీసుకుపోయి తండ్రికి వప్పగించి, ఒక్కనమస్కారం పెట్టాడు.

చదువు ఎట్లానూ అబ్బేటట్టులేదు. పోనీ, సంసారబాధ్యత నెత్తిన వేసినట్టయితే బుద్ధి వస్తుందేమోనని ఆశపడి, తండ్రి మనవాడికి ఇంటిపనులు వప్పగించాడు. సరి, మూడోరోజుకల్లా ఇంటి వ్యవహారాలన్నీ ఒక కొలిక్కి తీనుకువచ్చాడు మనవాడు.

దీంతో కన్న తండ్రికి కూడా మనస్సు విరక్తి చెందిపోయింది. "ఒక్క క్షణమైనా నువ్వు నా యింట ఉండటానికి వీల్లేదు. పో, అకతాయివెధవా! పో–నీ కర్మం నీది" అని కసిరి, కొడుకుని ఇంట్లో నించి వెళ్ళగొట్టేశాడు.

మొండితనం మన అకతాయి ఉగ్గుపాలతో నేర్చిందే. తండ్రిమాటలేమీ వాడు మనసుకి పట్టించుకోలేదు. "జయ్ పరమేశ్వరా!" అని బయల్దేరాడు.

వెళ్లగా వెళ్ళగా అకతాయికి ఒక అరణ్యం అడ్డు తగిలింది. అక్కడ ఒక మనిషి వున్నాడు. వాడు రకరకాల చెట్లన్నీ పీకి గుట్టలువేసి మోపులు కడుతున్నాడు.

"అబ్బీ, నువ్వెవరవు?" అని అడిగాడు అకతాయి.

"అయ్యా, నేను చెట్టుపీకుడుగాణ్ణండి. మాది పెద్ద కుటుంబం. ఈ చెట్లు కొట్టి ఊళ్లో అమ్ముకుని, ఆలు



బిడ్డల్ని పోషించుకోవాలండి" అని బదులు చెప్పాడు.

"ఛఛా, కట్టెలు మోసుకుపోయి అమ్ముకోపటం ఎంతకష్టం! దీనివల్ల జీవనం గడుస్తుంది గనకనా? నెలకి నూరు వరహాలు జీతమిస్తాను. నా వెంట రా" అన్నాడు అకతాయి. సంతోషపడ్డాడు చెట్టుపీకుడుగాడు. కలప యింట్లో పారేసివచ్చి, అకతాయితో కలిసి పోతున్నాడు.

వీళ్లిద్దరూ కొంచెందూరం వెళ్లేసరికి, మరొక చిత్రమైన మనిషి కనపడ్డాడు. వాడు విల్లెక్కుపెట్టి గురిచూస్తున్నాడు.



"అబ్బి, నువ్వెవరవు? ఏమిటి చూస్తున్నావు?" అని అడిగాడు అకతాయి.

"అయ్యా! నా పేరు గురిగాడు. ఇక్కడికి ఆమడదూరాన ఒక మామిడిచెట్టున్నది. ఆ చెట్టు కొట్టకొస కొమ్మ మీద గుబురుచాటున ఒక చిలుక వున్నది. దాని కుడికంటికి గురిచూస్తున్నా"నన్నాడు.

"అబ్బీ, ఇట్లా ఎన్ని చిలకల్ని చంపితే మాత్రం నీకు కడుపు నిండుతుంది గనకా! నాతో వచ్చేసెయి, నెలకి నూరువరహాల జీతమిస్తాను" అని చెప్పేసరికి, సంతోషించి, వాడూ అకతాయితో కలిసి పోతున్నాడు.

ఈ ముగ్గురూ కలిసి పోగాపోగా, మరొక వింతమనిషి అగపడ్డాడు. ఒక చెట్టుకింద పండుకొని, వాడు ఎడంముక్కుతో కొంతసేపూ, కుడిముక్కుతో మరికొంతసేపూ వూదుతున్నాడు. "ఓయి, నువ్వెవరోయ్, ఇదేమిటి, ఈ వూదడ మేమిటి?" అని అడిగాడు అకతాయి.

"బాబూ! నా పేరు వూదుడుగాడు. ఇక్కడ వుండి ఎంతదూరాన కొలిమి అయినా వూదగలను. నన్నొక కమ్మరి పది వరాల జీతంమీద పెట్టుకున్నాడండి" అన్నాడు. ఊదుడుగాడ్నికూడా నెలకి నూరు వరహాల జీతంమీద వెంట తీసుకుపోతున్నాడు అకతాయి.

నలుగురూకలిసి కొంచెందూరం పోయేసరికి దోవలో ఇంకో విచిత్రమైనవాడు తారసపడ్డాడు! వాడు పాదాలు ఒక చెట్టుకి కట్టేసుకుని, మీగాళ్ళమీద బండ పెట్టుకొని పడుకున్నాడు.

"ఇదేం వేషం? ఇట్లా పవ్వళించావేమిటి? నువ్వెవరవోయ్?" అని వాడిని పలకరించాడు అకతాయి.

"నన్ను కాలిచురుకుగా దంటారండి. కాళ్ల కట్లు విప్పితే చాలు, అదేపనిగా పరు గెత్తుతాయి. నా పరుగుతోపాటు ఎగరడం పక్షులకే చేతగాదు. మరి మనుష్యులమాట చెప్పేదేమిటి?" అని జవాబు ఇచ్చాడు.

"భేష్. నువ్వు మాతో ఉండవలసిన వాడవు" అని చెప్పి, వాడినీ నూరు వరా హాల జీతంమీద జట్టులోచేర్చుకుని, వెంట బెట్టుకు పోతున్నాడు ఆకతాయి.

అందరూ ఒక పట్టణం చేరుకున్నారు. పేదరాసి పెద్దమ్మ యింట్లో బసచేశారు. "అవ్వా! మీ పట్టణంలో విశేషాలేమిటి?" అని అడిగాడు ఆకతాయి.

"విశేషాల కేముంది నాయనా!– మా రాజుగారు కడు వృద్ధు. పురుషసంతతి లేదు. ఒక్కగా నొక్క కూతురు కావటం చేత, ఒకకుర్రవాణ్ణి ఇంటల్లుడుగా తెచ్చు కొని వాడికి పట్టంకట్టాలని తాపత్రయం పట్టుకుంది. కానైతే, చక్కటి సంబం ధాలు ఎన్నివస్తేమట్టుకి యేంలాభం? 'నాతో సరిసమానంగా ఎవరైతే పరుగెత్తగలరో వాడినే పెళ్లాడతాను, లేకపోతే ఇట్లాగే ఉండిపోతాను' అనిచెప్పి రాజపుత్రి పంతం పట్టి కూర్చున్నది. రాజ్యంకోసం, రాజ కుమార్తెకోసం ఆశపడి ఎందరెందరో ఎక్కడెక్కడినించో వచ్చారు. పందెం






"అల్లానే పంపించు. కాని, పందెంలో నీ భటుడు వోడిపోయినా, నిన్నే తల తీయించివేస్తాము సుమా!" అని హెచ్చరించాడు రాజు.

ధైర్యంతో 'సరే' నన్నాడు ఆకతాయి. పందెంలో నెగ్గిరావటానికి కాలిచురుకు గాణ్ణి వప్పగించాడు.

రాజుగారు ఒకచోట కూర్చున్నారు. పందెగాళ్లిద్దరకూ చెరివకటీ బంగారు లోటా లిచ్చారు. అక్కడికి కోసెడుదూరంలో వున్న కొలనులో నీళ్లు ముంచుకువచ్చి రాజుగారిని తాకాలి. ఇదీ పందెం.

ఇద్దరూ బయల్దేరారు. రాజపుత్రి కొలను చేరేలోగా అప్పుడే కాలిచురుకుగాడు నీళ్లు ముందుకుని సగం దూరం వచ్చేశాడు. ముందుగా వచ్చేశాంకదా అనే ధైర్యంతో వాడు ఒక రాయి తలకింద పెట్టుకుని, తోవలో చెట్టుకింద పండుకున్నాడు. ఇంతలో రాజకుమార్తె నీళ్లు ముంచుకు వస్తూ, కాలిచురుకుగాడి లోటాలో నీళ్లు పారబోసేసి పరుగుచ్చుకుంది!

ఇది చూచి, ఆకతాయి బిక్కమొగం వేశాడు. 'అయ్యోపాపం!' అంటూ అందరూ జాలిపడ్డారు. ఈ సమయంలో కాలిచురుకు

నెగ్గలేక ప్రాణాలు వదులుకున్నారు. ఏం చెప్పమంటావు నాయనా!" అంటూ, కోటలో జరుగుతున్న కథ యావత్తూ విని పించింది పేదరాసి పెద్దమ్మ.

మర్నాడు మన ఆకతాయి సరాసరి రాజుదగ్గిరికి వెళ్లి "మహారాజా! నీ కూతురిని నాకిచ్చి పెళ్లి చెయవలిసిం" దని అడిగాడు. "అల్లాగే చేస్తాను. మరి. మా అమ్మాయితో పాటు పరుగెత్తగలవా?" అని అడిగాడు రాజు.

"ఓసి, ఈపాటిదానికి నే నెందుకూ, నా భటుణ్ణి పంపిస్తాను" అన్నాడు ఆకతాయి.

గాడి తలకింది రాతికి గురిపెట్టి, గురిగాడు బాణం వేశాడు. ఆ దెబ్బతో కాలిచురుకు గాడు నిద్దర లేచాడు. లోటా చూచు కొన్నాడు. మోసంతెలుసుకున్నాడు. కను మూసి తెరిచేటంతలో మళ్లీ కొలనుకుపోయి, నీళ్లు నింపుకొని వచ్చి రాజపుత్రికంటె ముందుగా తాను రాజుని తాకాడు. అందరు "శెభాస్" అని సంతోషించారు.

మరిప్పుడు అకతాయే పందెం గెలిచి నట్టు. రాజపుత్రి నిచ్చి పెళ్లి చెయ్యక తప్పదు. కాని, వాడికివ్వటం రాజుకి సుతరామూ ఇష్టంలేదు. అకతాయిని పిలి పించి ఇట్లా చెప్పాడు: "అయ్యా, మీకు మా పిల్లనిచ్చి పెళ్లిచేస్తా మనుకోండి. మీదీ మాదీ ఒక కులంకాదు, ఒక గోత్రంకాదు, బంతిభోజనం లేని సంబంధంవల్ల వేడు కేమిటి, సంతోషమేమిటి? కాబట్టి మీరు మొయ్యగల ధనమిస్తాము. అది తీసుకుని వెళ్లి, పెళ్లిసంగతి మరిచిపొండీ!" అని వేడుకున్నాడు.

"సరే, రాజా! మీ మాటకి అడ్డుచెప్పను. ధనం మొయ్యడ మనేది గొప్ప పనికాదు. ఈపాటిదానికి నే నెందుకూ? నా భటుణ్ణి పంపుతాను" అన్నాడు అకతాయి.



ఈ లోపుగా చెట్టుపీకుడుగాడు ఒక కోసెడు చతురం గల బ్రహ్మాండమయిన సంచీ తయారుచేయించి, అది పట్టుకొని కోటకు వెళ్లాడు. సంచి మూతి తెరిచి, "పొయ్యండి, ఎంతధనం పొయ్యగలరో ఇందులో పొయ్యండి!" అని తయారుగా కూర్చున్నాడు.

రాజుగారి ఖజానా అంతా ఖాళీ అయి పోయింది! సంచీ నిండలేదు. ఇంకా ఎక్క డెక్కడి నించో బళ్లతో తెప్పించారు ధనం. అదంతా బళ్లతో సహా సంచిలో పడవేస్తు

కుంటున్నాడు చెట్టుపీకుడు గాడు!! ఎంతకూ నిండదు సంచీ.

కొంతసేపటికి రాజుమీద జాలిపడి, చెట్టుపీకుడుగాడు సంచీమూతి కట్టేసి, బంతిలాగ ఎగరేసుకుంటూ పట్టుకుపోయాడు.

ఇదంతా చూసి, రాజుకి కన్ను కుట్టింది. అకతాయిగాడూ, వాడి భటులూ పట్టణం పొలిమేర దాటకముందే మెత్తగా తన్ని, ఆ ద్రవ్యం అంతా తిరుగా తీసుకరమ్మని సైన్యాన్ని వెంబడే పంపించాడు.

అకతాయి బలే యుక్తిపరుడు. రాజు పన్నిన వ్యూహం ఇట్టే పసికట్టాడు. జట్టుదారులకి సంజ్ఞ చేశాడు. 'సైం' అన్నాడు. వెంటనే వూదుడుగాడు ఒక ముక్కు బిగబట్టి రెండో ముక్కుతో ఒక్కసారి వూదాడు. రాజుగారి సైన్యమంతా, ఉల్లిపొట్టులాగా రెండుకోసులు దూరానికి యెగిరి చక్కాపోయింది!

ఒకడో యిద్దరో చచ్చిచెడి కొనవూపిరితో బయటపడ్డారు. వాళ్లు రాజుగారి పాదాల మీద పడి మొరపెట్టుకున్నారు. పడ్డబాధలన్నీ అనేకవిధాల చెప్పుకొని యేడ్చారు. జరిగినదానికి రాజుగారూ విచారించారు.

ఇక అకతాయిగాడు—రెట్టింపుగా జట్టుదార్లకి జీతాలిచ్చి వాళ్ళని సంతోషపెట్టాడు. ఇప్పుడు ఈ సొమ్ము మోయటానికి మరి నూరువరహాలకు చెట్టుపీకుడుగాణ్ణి మాటాడుకుని, బ్రహ్మాండమైన ఆ డబ్బు మూటతో ఇల్లు చేరుకున్నాడు. కుమారుడి ప్రయోజకత్వం చూచి తలిదండ్రులు పొంగిపొయ్యారు. అప్పట్నుంచీ అందరూ హాయిగా వుంటున్నారు.

పాపలూ!— దేవుడిసృష్టిలో పనికిరాని మనిషి లేడు, పనికిరాని వస్తువు లేదు. ఒక మనిషి రాణించాలంటే కాలం, కర్మం కలిసి రావాలి. అప్పుడే వాడి రేఖ బయటపడుతుందంటారు పెద్దలు.






పూర్వం పెద్దపులీ చెవులపిల్లీ ఒకఅడవిలో ఇరుగుపొరుగున కాపరం ఉండేవి. మాట వరసకి, వాటికి ఇట్లా పేర్లు పెడదాం: పులి దంపతులకు మెకమయ్య, మెకాలమ్మ. కుందేలు దంపతులకు చెవలయ్య, చెవలమ్మాను. వారూవీరూ చాలా అన్యోన్యంగా ఉండేవారు. వాళ్ళస్నేహం ఇట్లాటిదీ అని నోటిమాటలతో చెప్పలేము. అంత అరమరా కల్లాకపటము లేకుండా కలిసివుండేవారు.

ఉభయుల ఇళ్లు కూడా పూరివి. ఇక వర్షా కా లం వస్తే చాలా ఇబ్బంది. అందుకని అడవిలోకి పోయి, అవురుగడ్డి తెచ్చుకొని, గుడిసెలు దిట్టంగా వేసుకోవాలి. లేకపోతే వానాకాలం నాలుగునెలలూ ఇబ్బందిపడవలసి వస్తుంది.

అందుచేత, మెకమయ్యగారూ చెవలయ్యగారూ కొన్నాళ్ళపాటు రోజూ అడవికి వెళ్లి, తాము మోసినంత గడ్డి తీసుకురావాలని నిర్ణయించుకున్నారు.

ఇక ఆ మర్నాటినించి, ఇద్దరూ చీకటితోనే చద్దితిని మధ్యాహ్నం భోజనానికి ఫలహారం పట్టుకుపోయి, ఆ పగలంతా గడ్డికోసి సాయంకాలానికి ఇల్లు చేరుకునేవారు.

మెకమయ్యగారికి 'పులిహోర' అంటే బలే యిష్టం. మరి, చెవలయ్యగారు మెకమయ్యగారికి ప్రాణస్నేహితుడేగా? ఆయనకు ఏది యిష్టమో, ఈయనకూ అదే ఇష్టమన్న మాట. మెకమయ్యగారికి భార్య పులిహోర ఫలహారం తయారుచేసి యిస్తే, చెవలయ్యగారికి ఆయన భార్యకూడా పులిహోరే తయారుచేసి ఇచ్చింది!

ఎవళ్ళ మూట వాళ్లు చేతపట్టుకుని, పొడుగాంటి పిడివుండే కొడవళ్లు ఇద్దరూ చెరొకటీ భుజానవేసుకుని, మంచి శకునం చూసుకుని పనికి పోయారు. ఇట్టుగా వెళ్లిన నేస్తులిద్దరూ గడ్డికోసి, వెంటితో కట్టి, పీపున వేసుకుని సాయంత్రానికి చక్కా ఇంటికి వచ్చేశారు.

గొబ్బూరి వెంకటానంద రాఘవరావు




ఇట్లా రెండు మూడు రోజులు బాగానే గడిచినై. కాని, కాలం ఒక్కలాగ వెళ్ళదంటారుకదూ, పెద్దవాళ్లు! ఆ మాట అక్షరాలా నిజమయింది ఇప్పుడు.

ఒక రోజున పులిదంపతుల మధ్యని ఏదో చిన్న పేచీవచ్చింది. అది చిలికి చిలికి గాలివానైంది. మెకాలమ్మవారికి మొగుడు మీద గొంతువరకు కోపం వచ్చేసింది. 'నీ గడ్డి నీకు పెట్టి, నీ రోగం చప్పగా కుదురుస్తానుండు' అని ఆవిడ పంతం కట్టింది. అమ్మో! ఆడది అలిగితే ఇంకేమన్నా వుందా? మగవాడు వాడిగడ్డి వాడు కరచక ఏమిచేస్తాడూ?

కోపంతో కుమిలిపోతున్న మెకాలమ్మ గారు మర్నాడు ఏంజేసిందో తెలుసా?— పులిహోర లేదు, గిలిహోర లేదు. ఫలహారపు మూటనిండా గడ్డీ గాదం కూరి, పైకి కనపడకుండా గట్టిగా కట్టి మహా భక్తితో భర్తకి అందించింది. ఆ మూట పట్టుకుని మెకాలయ్యగారు ఎంతో వుత్సాహంతో అడవికి వేంచేశారు.

ఎండ మాడుస్తూవుంది. మధ్యాహ్నం రెండుఝాము లయ్యేసరికి మెకమయ్య గారికి కడుపులో ఎలికెలు గంతులు వెయ్యటం ప్రారంభించినై. పాపం ఫలహారం తిందామని మూట తెచ్చుకుని చెట్టుక్రింద కూర్చున్నాడు. తీరా అది విప్పి చూచుకుంటే యేముందీ? అంతా గడ్డి. మరి ఏమిచేస్తాడు ఇప్పుడు? ఆకలి దహించుకుపోతూవుండె: ఇక యిది కాదు పని అని అటు యిటు చూసి, ఎదట వున్న చెవలయ్యగారి ఫలహారపు మూట తీసి, మెల్లిగా, లొట్టలు వేసుకుంటూ, అందులో వున్న పులిహోర కాస్తా కాజేశాడు.

ఇక చెవలయ్య కనుక్కోడూ ఈ దొంగ తనం? అందుకని మెకమయ్య మళ్లీ జాగ్రత్తగా తన మూటలో గడ్డి వాడి మూటలో పెట్టి కట్టి తనకు ఏమీ తెలియనట్టు తప్పు కున్నాడు.

ఇంతలో—అలసిపోయిన చెవలయ్య గారు ఆవురావురుమంటూ ఫలహారం తిందామని వచ్చారు. మూట విప్పారు గబ గబాలాడుతూ ఆత్రంగా. ఏముందిగనకా, అందులో?-

ఉసూరుమంటూ పోయి, ఆ దగ్గిరే వున్న చెలమలో ఇన్ని చల్లటినీళ్లు తాగి దప్పి తీర్చుకున్నాడు. కానైతే, ఈ దొంగపని చేసిందిఎవరు?-ఈ ప్రశ్నతో చెవలయ్యగారి మనస్సు ఉడికిపోతూంది.

సాయంకాలానికి పని ముగించుకొని, ఉక్రోషంతో ఉరకలు వేసుకుంటూ కొంప చేరుకున్నారు చెవలయ్యగారు. రాగానే భార్యని పిలిచి, "ఏమే, చెవలపిల్లీ! నీ కిదేం పాడుబుద్ధి? ఫలహారపు మూటలో గడ్డికట్టి ఇస్తావా? నాతో నీకు వేళాకోళమా? చూస్తో, నిన్ను డొక్క చీల్చి డోలు కడతాను..." అంటూ ఇంటికప్పు ఎగిరిపొయ్యేటట్టు ఉరి మాడు, పళ్లు కొరుకుతూ.



"అయ్యో దేవుడా! నేనేపాపమూ ఎరగ నండీ. కమ్మటి పులిహోర చేసి కడితే, గడ్డి కట్టా నంటారేమిటీ? ఎక్కడన్నా వుందా ఇంత విడూరం!" అని గోలెత్తింది, ఆ అమాయికపు యిల్లాలు చెవలమ్మగారు.

సరే, ఆనాటికి సద్దు అణిగింది. ఆలు మగలు సమాధానపడి, హాయిగా నిద్ర పోయారు.

మళ్లీ ఆ మర్నాడూ ఇదే తంతు జరిగింది. మెకమయ్య భార్య భర్త తెగులు కుదర్చటానికని సంచిలో ఇవాళ కూడా గడ్డే కూరి ఇచ్చింది. భార్యను మంద



లించుకోవటం చేతకాని మెకమయ్య ఏం చేస్తాడూ ? లోకువగా వుండే చెవలయ్యని మోసం చేయసాగాడు. ఇది గ్రహించక చెవలయ్య ఇంటికి పోయి భార్యమీద మళ్లీ మండిపడ్డాడు. ఆమెను చంపుతానని కూచున్నాడు.

అమాయకురాలైన చెవలమ్మ దేవుడి సాక్షిగా వొట్టేసుకుని, భర్తతో చివరకు ఒకమాట చెప్పింది: "చూడండి! మీ మూటలో ఫలహారం తినేసి ఎవడో దొంగ రోజూ గడ్డి కూరుతున్నాడు. మధ్యాహ్నం పన్నెండుగంట లప్పుడు పొంచివుండి, ఆ దొంగ ఎవరో కనిపెట్టండి. కనిపెట్టి మెత్తగా తన్నండి. అంతేగాని. ఉత్తపుణ్యానికి నన్ను అనుమానించి శిక్షిస్తానంటే నేనేం చేయగలను,?'' అని యేడ్చి మొత్తుకున్నది.

అవును, ఇది నిజమే కావచ్చని తోచింది చెవలయ్యగారికి. మర్నాడు చెవలయ్య అడివికి వెళ్లేటప్పుడు భార్య ఫలహారపు మూట విప్పి చూపి మరీ చేతికిచ్చింది.

ఈ రోజున చెవలయ్య దృష్టిఅంతా ఫలహారపు మూటమీదనే వుంది కాని, పని మీద లేదు. ఎట్లాఅయినా దొంగని పట్టితీరాలని అతని పట్టుదల. మామూలుగానే తన మూట అనవాలుగా దాచుకొని, గడ్డికోత ఆరంభించాడు. ఒక్క గంటసేపు తరవాత వచ్చి అవురు దుబ్బులచాటున దాక్కున్నాడు.

కాసేపటికి మధ్యాహ్నమయింది. మెకమయ్యగారువచ్చి, మెల్లిమెల్లిగా చెవలయ్య మూటకి తలపడ్డాడు. మెకమయ్యచేసే చేష్టలన్నీ కళ్లారాచూశాడు చెవలయ్య, అవురు దుబ్బు చాటున పొంచివుండి. "అరి నీ దుంపతెగా, నువ్వేనా యింత గమ్మత్తూ

చేస్తూంట! నిష్కారణంగా నా యిల్లాలు మీద నేను అనుమానపడ్డాను. సరే, కానీ!!-" అని మనస్సులో కోపగించుకొన్నాడు. మెకమయ్యమానాన మెకమయ్య రోజూలాగే పులిహోర తినేసి చల్లగా వెళ్లిపోయాడు. చెవలయ్య మాత్రం తొందరపడలేదు. ఆ రోజున కూడా ఇన్ని నీళ్లు తాగి పొట్ట నింపుకొన్నాడు.

సాయంత్రం స్నేహితు లిద్దరూ కలుసుకున్నారు. ఇవాళ చెవలయ్య మామూలు కంటే ఎక్కువ గడ్డి కోసి, సిద్ధం చేశాడు. ఇక ఇద్దరూ ఇంటిముఖం పట్టివున్నారు.

ఇంతలో మెకమయ్య అడిగాడు: "ఏం చెవలయ్యా! ఇవాళ అట్లాగున్నావేం?" అని.

"ఏం చెప్పేది బాబూ! చలీ జ్వరం ఎగేసుకు వచ్చింది. ఇవాళ ఎలా కొంప చేరుకుంటానా అని బెంగపట్టుకుంది" అంటూ జవాబు చెప్పాడు చెవలయ్య.

మెకమయ్యకు కనికరంవేసింది. "పోనీ చెవలయ్యా! నీ గడ్డిమోపు నా వీపుమీద వేసి కట్టి దానిపైన నీవుకూర్చో, నాగడ్డివేరే ఆనవాలుగా పెట్టు, నేను నిన్ను ఇంటికి చేరుస్తాను" అని సలహా చెప్పాడు.



"ఓహెూ, మెకమయ్యా! నీ ఉపకార బుద్ధి ఏమని చెప్పను? నిజంగా నువ్వు ఆపద్బాంధవుడివి. అన్నవయినా తమ్ముడివైనా నాకు నువ్వేను," అని అనేక విధాలుగా కృతజ్ఞత తెలుపుతూ—చెవలయ్య మూలుగుతూనే, పులి వీపుమీద ముందు పులి కోసిన గడ్డి పరిచాడు. ఆమీద తను కోసిన రెండురోజుల గడ్డీ పరిచి, పక్కలీన్నిపైనా దగ్గిరదగ్గిరగా వెంట్లువేసి మెకమయ్య వళ్లంతా కట్టేసి, దానిమీద చెవలయ్య ఎక్కి కూర్చున్నాడు, మహారాజులాగ.

మెకమయ్యా మెల్లిగా అడుగులు వేసుకుంటూ ఊరి పొలిమేర సమీపించాడు. అక్కడనే శ్మశానం. ఆ శ్మశానంలో ఒక శవం తగలడుతూవుంది. చెవలయ్యా మెకమయ్యాకు తెలియకుండా దిగి అందులోంచి ఒక చిన్న కాలేకాలే కట్టిపుల్ల తీసుకొచ్చి మెకమయ్యా వీపుమీది గడ్డికి ముట్టించాడు. గడ్డివెంటి అంటుకుని, మెకమయ్యా వళ్ళంతా తెగకాలింది.

మెకమయ్యా శరీరం కాలిపోతూవుంటే, చెవలయ్యా బుద్ధి చెప్పాడు: "హోయ్ మెకమయ్యాగారూ! మరెన్నడూ ఇతరుల మూటలో ఫలహారం కాజేసి గడ్డి దూర్చకండేం?" — ఇట్లా చెబుతూ, చెంగున దాటేశాడు చెవలయ్యా.

అసలింతకీ, ముఖ్యమయిన సంగతి మీకు చెప్పటమే మరిచా. మొదట్లో పులికి చారలూ మచ్చలూ లేనేలేవుట!

ఇదుగో, - అది ఇట్లాటి దొంగపని చేసేటప్పటికి, కుందేలు దానికి పరాభవం చేసి బుద్ధిచెప్పడం జరిగింది. వెంటి అంటుకున్న దిక్కునల్లా అడ్డుగాను నిలువుగాను కాలిపోయి, మన మెకమయ్యాగారికి నల్లటి చారలూ మచ్చలూ ఏర్పడ్డాయి. 'తాత చేసిన పాపం తరతరాలా పోదు' అన్నట్టుగా, ఈపాపం మన ఒక్క మెకమయ్యాగారితో పోలేదు. పులిజాతి కంతకీ ఈ నల్లటి చారలూ మచ్చలూ శాశ్వతంగా అచ్చుపడిపోయినయి.

ఈ నల్లటి మచ్చలు పులిజాతికి మాయని మచ్చలుగా నిలిచివున్నాయి. ఈ మచ్చలే లేకుండావుంటే, పులిజాతి చక్కా పచ్చటి శరీరచ్ఛాయతో ఎంత అందంగా వుండేది!!

అందుకనే—మనిషేకానీ జంతువేగానీ జీవితంలో మచ్చ రాకుండానే చూచుకోవాలె. వచ్చిందా అంటేమటుకి, మాపు చేయటం మనవల్ల కాదు.






అనగనగా ఒక అడవిలో ఒక పావురం. ఆ పావురానికీ ఒక నక్కకీ మంచి స్నేహం. అయితే నక్క జిత్తులమారిది, పావురం వెర్రిబాగుల్దిన్ని.

ఒకనాడు నక్క, పావురాన్ని దగ్గిరికి పిలిచి అన్నదికదా—"నేస్తం నేస్తం, ఒక సంగతి చెప్తా విను: ఎవరయితే నన్ను బాగా నవ్విస్తారో, ఎవరయితే బాగా ఏడిపిస్తారో, ఎవరైతే నాకు కడుపునిండా భోజనం తెచ్చిపెడతారో, వాళ్లే నాకు నిజమయిన స్నేహితులు. నువు ఈ పనులు చేయగలిగితేనే నాకు నిజమయిన స్నేహితురాలివి, లేకుంటే కాదు" అని చెప్పింది.

"ఓశ్, ఇదేపాటి పని. చూపిస్తానుకదా నా తెలివితేటలు" అని నమ్మబలికింది పావురం.

పావురం పైన ఎగురుతూ, నక్క భూమిమీద నడుస్తూ, సాగిపోతున్నాయి.

ఆ దారిని ఇద్దరు బాటసారులు వెళుతున్నారు: ముందు పోతున్నవాడి మూట మీద మెల్లిగా వాలింది పావురం.

'బలే బాగా వున్నదిరా ఈ పావురం పెంచుకోటానికి' అని చెప్పి రెండవ బాటసారి, పావురాన్ని పట్టడంకోసం చేతికర్ర విసిరాడు. అది వెళ్లి సరాసరి—మొదటివాడి కాలికి తగిలింది. ఇంకేం, ఇద్దరి మధ్యనీ జగడం పడింది. ఇదంతా వినోదంగా చూసి నక్క పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వింది.

పావురం వచ్చి, "ఏం నేస్తం, ఎట్లా వుంది?" అని అడిగింది.

"చాలా బాగున్న"దని అంటూ సంతోషాన్ని తెలిపింది నక్క.

కె. శారద, విశాఖపట్నం

మరికొంచెం ముందుకి సాగిపోయినవి నక్కా, పావురమున్నూ.

అక్కడ రెండు వేటకుక్కలు కనిపించాయి. పావురం వెళ్లి, వాటిమీద వాలి, చురచురా పొడిచి వుసికొల్పింది. తను పోయి చెట్టుమీద కూర్చుంది. కోపంతో వున్న ఆ వేటకుక్కలు నక్క కంటబడగానే దాన్ని పట్టి పల్లార్చి నానా హింసలూ పెట్టినయి. బాధకి తట్టుకోలేక, నక్క యేడిచి రాగాలెట్టింది.

పావురం దిగివచ్చింది. "ఏం నేస్తం, ఎట్లా వుంది?" అని పలకరించింది.

"ఏం చెప్పమంటావు, కుక్కలు నన్ను చంపి వదిలినయి. ఇట్లా ఏడుస్తున్నా" నన్నది.

మళ్లీ మామూలుగా వెళుతున్నాయి నక్కా పావురమున్నూ.

ఒక పల్లెపిల్ల తట్టలో భోజనం పెట్టి పొలంలోకి పట్టుకువెళుతూంది. పావురం దానిమీద వాలి బుట్ట తిరగదోసింది. ఇంతలో నక్క అగపడేసరికి, తట్ట అక్కడే వదిలేసి, ఆ అమ్మాయి హడిలి పారిపోయింది. నక్క హాయిగా కడుపు నిండా భోజనంచేసింది.

పావురం వచ్చి, "ఏం నేస్తం, ఎట్లా వుంది?" అని అడిగింది.

"చాలా బాగా వుంది. నేస్తమంటే నువ్వే నిజమయిన నేస్తానివి" అంటూ అనేక విధాలుగా పావురాన్ని నక్క పొగడటం ప్రారంభించింది.

అప్పటినించీ ఆ రెండూ నిజమయిన నేస్తాలుగా ఉండిపోయినయి.






అనగాననగా ఒక అడవి. ఆ అడవిలో ఏడుగురు దొంగ లుండేవారు. ఒక రోజున వాళ్లు దొంగతనానికని బయల్దేరివస్తూండగా పంచాంగశాస్త్రి ఎదురుపడ్డాడు. నున్నటి బోడిగుండు, గుండుమీద వంకాయముచ్చి కంత పిలక, వొంటినిండా విభూతిరేఖలు: చంకని విసినికఱ్ఱ, చేతులో వంచాంగం- ఇదీ శాస్త్రుల్లు వేషం.

శాస్త్రివేషంచూసి దొంగలు నవ్వారు. వాళ్లని ఎగాదిగా చూసి, వాళ్లు ఫలానావారు కదా అని శాస్త్రి తెలుసుకున్నాడు. అయన ఇప్పుడు దొంగలచేతుల్లో చిక్కుకున్నాడు. వాళ్లు పిలక ఊడగొట్టి చేతులో చెంబూ, బుజంమీది అంగవస్త్రం లాక్కున్నా తను చేసేది ఏమీలేదు.

ఇటువంటి సమయంలో శాస్త్రికి మంచి ఉపాయం తట్టింది. దొంగల్ని దగ్గిరికి పిలిచి "వోయి అబ్బాయిలూ! ఇలా, వేళా పాళా లేకుండా మీ యిష్టం వచ్చినప్పుడల్లా దొంగతనానికి బయల్దేరితే లాభంలేదు. నేను పంచాంగంచూసి, మంచి ముహూర్తం పెట్టుతూవుంటాను. నేను చెప్పినట్టుగా చేశారంటే, మీరు పట్టుపడరు. పైగా కోరినంత ధనం దొరుకుతుంది. మీరు హాయిగా కాలక్షేపం చెయ్యొచ్చు" అని వాళ్ళకి సలహా ఇచ్చాడు.

ఈ మాటలు వినంగానే వాళ్లకి వొళ్లు పరవశమైపోయింది. "అంతకంటేనా బాబయ్యా! మీరు చెప్పినట్టే నడుచుకుంటాం. తప్పకుండా పంచాంగం చూసి లగ్నంపెట్టండి" అన్నారు అందరూ.

ఆనాటినించీ పంచాంగశాస్త్రి ముహూర్తం పెట్టుతూ ఉండేవాడు. ఆ ప్రకారమే దొంగలు కన్నాలువేస్తూ, చాలా ధనం సంపాదించుకుంటున్నారు. వాళ్లు తమకు దొరికిన ధనంలోనించి పంచాంగశాస్త్రికి పదేసివరాలు గురుకట్నం ఇస్తూవుండటం కూడా మామూలయింది. కట్నం ఇవ్వటమే గాకుండా, దొంగలు అయన్ని ఎక్కువగా గౌరవిస్తున్నారు.

ఆలపాటి అమృతం, మచిలీపట్టణం



కొన్నాళ్ళయ్యేసరికి, పంచాంగశాస్త్రికి దుర్బుద్ధి పుట్టింది—'మనకి వాళ్ళిచ్చేకట్నం ఏమూల కొస్తుంది? ఇంతకంటే మనం వాళ్లతో చేరిపోయి వాటా పుచ్చుకొన్నట్టయితే ఎక్కువ వొస్తుంది, కొద్దిరోజుల సంపాదనతో చక్కగా కొడుకుపెళ్లి చేసుకోవచ్చు' అని అనుకున్నాడు. ఈ వుద్దేశం దొంగలకు చెప్పి, 'నేనూ మీతో వస్తాను, నన్ను కలుపుకొని వాటాఇవ్వండి' అని కోరాడు.

"ఎంతమాట అన్నారు బాబయ్యా! మీరీ కష్టాలు పడలేరు. కావాలంటే ఒక వెయ్యి వరహాలు తెచ్చి యిచ్చుకొంటాము. అబ్బాయిగారికి వైభవంగా పెళ్లి జరిపించండి," అని దొంగలు చెప్పారు.

వెంటనే శాస్త్రి పంచాంగం చూసి, చిరునవ్వుతో: "రేపు ఏకాదశి తిథి బాగా వుంది. ఈ తడవ ఉత్తరదిశకు వెళ్లితే మంచి లాభం కలుగుతుంది. తప్పకుండా బయల్దేరండి. నేనూ మీతో వస్తా"నన్నాడు, వాళ్ళతో.

"మీకు ఎందుకొచ్చిన పాట్లు బాబూ! మీరు రావద్దు. మీకొక్కవలసిన ధనం యావత్తూ చేతులుకట్టుకు పట్టుకొచ్చి మీ పాదాలముందు పెడతాము" అని అనేక విధాల బతిమలాడారు దొంగలు. ఆ మాటలు ఎంతమాత్రం వినక, శాస్త్రుల్లు కూడా వాళ్ల వెంట ప్రయాణమయ్యాడు.

సరే, అనుకొన్నప్రకారం మర్నాడు రాత్రి వెన్నెట్లో, శాస్త్రితోసహా ఎనిమిదిమందీ ఉత్తరదిశకు బయల్దేరారు. ఒక వూరు చేరుకుని, ఆ గ్రామంలో ధనవంతుడైనటువంటి రంగయ్యగారింట చొరబడ్డారు.

అవేళ ఏకాదశి. రంగయ్యగారింట్లో అందరూ ఉపవాసమున్నారు. మర్నాడు ద్వాదశి పారాయణ. తెల్లవారుజామునే వంటలుచేయటానికని కూరలూ అవ్వీ తరిగేసి, పప్పులూ వుప్పులూ సిద్ధం చేసుకుని

పండుకున్నారు. దొంగలు ఇల్లంతా గాలించి పదివేలు విలువచేసే వస్తువాహనాలు, బోలెడంత రొక్కం లంకించుకున్నారు.

ఇంకా యేమైనా దొరుకుతుందేమో నని వంటింటివద్దకు వచ్చారు. తీరాచూస్తే వంటింట్లో మన పంచాంగశాస్త్రి మడికట్టుకుని, వంటచేస్తున్నాడు. వాళ్ళను చూడగానే "మడి తగలడిపోతుంది. లోపలికి రావద్దర్రా" అని వాళ్లకి సంజ్ఞ చేసాడు.

"అయ్యో బాబో! మన మింక ఇక్కడ ఉండకూడదు. చాలా ప్రమాదం. పోదాం రావయ్యా" అని దొంగలు బతిమాలారు.

"అదేమిటల్లా తొందరపడతారు! చిటికలో వంటయి పోతూంది. భోంచేసి పోదాం, వుండండి" అని అంటూ మనశాస్త్రి విస్తరాకులు వెతకబోయినాడు.

సావిట్లోకి పోయేసరికి, దేవుడిమందిరం కంటబడింది. 'ఇంతాచేసి, దేవుడికి నివేదన చెయకుండా భోజనమేమిటి? పాపం కూడా చుట్టుకొంటుంది' అనుకున్నాడు శాస్త్రి. యథావిధిగా దేవతార్చన ప్రారంభించి, గణ గణ గంట మోగించేసరికి,




ఒక్కమాటు ఇంట్లోవాళ్ళందరూ గభీమని లేచారు.

అందరినీ పంచాంగశాస్త్రి కంగారుతో చూస్తున్నాడు. 'నువ్వెవరవు' అని రంగయ్యగారు అడిగేసరికి, తను వచ్చిన సందర్భం యావత్తూ పూస గుచ్చినట్టు చెప్పేశాడు శాస్త్రి. "ఓయి, పిచ్చిబ్రాహ్మడా! ఎంతపని చేశావు?" అని రంగయ్యగారు శాస్త్రిని జాలి దలచి, పది వరహాలిచ్చి పంపాడు. పారిపోవటానికి వీల్లేక, దొంగలు పట్టుపడిపోయారు. వాళ్ళని జైల్లో వేశారు. దాంతో మన పంచాంగశాస్త్రికీ దొంగలకీ జట్టు విడిపోయింది.




ఒక రాజుకి ముగ్గురు కొడుకులు. వాళ్లు ముగ్గురూ సమస్త విద్యలూ చక్కగా నేర్చుకున్నారు. అన్ని విద్యల్లోనూ ముగ్గు రన్నదమ్ములూ సరిసమానంగానే ప్రజ్ఞ సంపాయించారు. ముగ్గురు కొడుకులమీదా రాజు ఒకేమోస్తరు గా ప్రేమ, అభిమానమూ చూపుతూండేవాడు.

రానురాను, రాజుకి ముసలితనం వచ్చే స్తున్నది. కొడుకుల్లో ఎవళ్ళకో ఒకళ్లకి తన రాజ్యం వప్పగించేసెయ్యాలి. అయితే— ఆయనకి ముగ్గురూ సమానమే. అందులో ఎవరికి వప్పగించటం?—ఈ ప్రశ్నకి ఆయనకు జవాబు తోచలేదు.

చాలాదూరం ఆలోచించాడు రాజు. కొడుకులు ముగ్గురినీ దగ్గిరికి పిలిచి: "నాయనలూ; చూడండి; నాకు వృద్ధాప్యం వచ్చేస్తున్నది. విశ్రాంతి తీసుకోవాలి కద? అందుకని, మీ ముగ్గురిలో ఎవరు, ప్రపంచంలోకల్లా విలువయిందీ వింతయి నదీ వస్తువు తీసుకురాగలరో, వాళ్ళకి రాజ్యం వప్పగించటానికి నిశ్చయించు కున్నాను" అని తన మనసులో వుద్దేశం కొడుకులతో చెప్పాడు.

తండ్రి చెప్పినమాటలు విని కొడుకులు ఉత్సాహపడ్డారు. సరేనంటే సరేనన్నారు. మర్నాడు ముగ్గురూ కావలసినంత ధనమూ, ఒకొక్క పంచకళ్యాణి గుర్రమూ తీసుకున్నారు. ఎక్కడవున్నాసరే, మూడు నెలల లోపున ముగ్గురూ ఒకానొక జాగాలో కలుసుకోవాలని నిశ్చయం చేసుకుని, తలొక దారీ పట్టిపోయారు.

వెళ్లి వెళ్లి పెద్దవాడు భీమకోట అనే వూరు చేరుకున్నాడు. పేదరాసి పెద్దమ్మ యింట్లో బసచేసి, వూళ్లో విశేషా లేమిటో చూచివద్దామని బయల్దేరాడు. వెళుతూ వుండగా దారిలో ఒకడు విచిత్రమయిన

డి. వి. ఏ. నరసింహారావు, పర్లాకిమిడి

తివాసీ అమ్ముతున్నాడు. "అబ్బీ! ఈ తివాసీలో వుండే చిత్రమేమిటి? ఇది ఎంత కిస్తావు?" అని అడిగాడు రాజకుమారుడు.

"అయ్యా! దీనిమీద కూర్చుంటే, తల్చుకున్నచోటికి వాయువేగంతో తీసుకుపోతుందండి. వెల వెయ్యి వరహాలండీ" అని చెప్పాడు. వెంటనే వెయ్యివరహాలూ యిచ్చి ఆ తివాసీ తీసుకున్నాడు రాజకుమారుడు.

"లోకంలో దీన్నిమించిన వింతవస్తువు మరేమిటి వుంటుంది? మా తండ్రిరాజ్యం నాకే వచ్చేస్తుంది" అని ఉప్పొంగిపోతూ, ఇంటిముఖం పట్టాడు.

కొన్నాళ్లు ప్రయాణంచేసి, రెండో రాజకుమారుడు రత్నపురం చేరుకున్నాడు. అన్నలాగానే అతనుకూడా, వూళ్లో వింతలు చూడబోయాడు. దార్లో ఒకడు చిత్రమైన దుర్భిణీ అద్దం అమ్ముతున్నాడు. ఆ అద్దంలో—మనస్సున తలుచుకున్నవాళ్లు ఎంత దూరాన వున్నాసరే—కళ్ళకి కట్టినట్టు కనిపిస్తారు. ఇంతకు మించిన వింత లోకంలో మరెక్కడ ఉండబోతుందను



కున్నాడు రాజకుమారుడు. రాజ్యం తనకే వస్తుందనే నమ్మకంతో ఆ అద్దాన్ని రెండు వేల వరహాలకుకొని, రెట్టింపు ఉత్సాహంతో ఇంటిముఖం పట్టాడు.

ఇంక, మూడో రాజకుమారుడు ఎన్నెన్నో అరణ్యాలు నదులు దాటి, సింహపురి అనే మహాపట్టణం చేరుకున్నాడు. భోజనంచేసిం తరవాత ఊళ్లో వింతలు చూచివద్దామని షికారు బయల్దేరాడు. దార్లో ఒకడు ఒక విచిత్రమయిన మామిడిపండు అమ్ముతున్నాడు. అయితే, దాని వెలయిచ్చి కొన




గలిగినవాళ్లెవళ్లూ కనబడటంలేదు. 'ఈ మామిడిపండులో వుండే చిత్రమేమిటి?' అని అనుకున్నాడు రాజకుమారుడు. అది వాడదట. ఎంతకాలమున్నా కుళ్ళదట. దాన్ని వాసనచూస్తే చాలు, ఎటువంటి జబ్బు అయినాసరే, మాయమై చక్కా పోతుందట. వెంటనే మూడువేల వరహాలిచ్చి ఆ మామిడిపండు కొనేసి, 'ఇంతకంటె గొప్ప వింత ప్రపంచంలో మరెక్కడ ఉండబోతుంది గనకా? నాకే వస్తుంది నా తండ్రి రాజ్యం' అని సంతోషిస్తూ కడసారి వాడున్నా ఇంటిముఖం పట్టాడు.

రాజకుమారులు ముగ్గురూ, వాళ్లు ఏర్పాటుచేసుకున్న చోటున కలుసుకున్నారు. 'నా వస్తువు గొప్పదంటే నాదే గొప్ప'దని వాళ్లలో వాదన ప్రారంభమయింది.

ఆఖరున రెండవవాడు అన్నాడుకదా: "మనం ఇలా వాదులాడుకోవటం యేమీ బాగులేదు. నాదగ్గిర దుర్భిణీఅద్దం ఉండనే వున్నది. అందులో ఒక్కసారిచూచి, నాన్నగారి పరిస్థితి తెలుసుకుందాం" అని. ఈ మాటకి తక్కిన యిద్దరూ తల వూపి, భేష్ అంటే భేష్ అన్నారు. మనసులో తలుచుకొని అద్దంలో చూచారు. కొడుకులు ఎప్పటికీ రాకపోవటంచేత రాజుగారు బెంగపెట్టుకుని మంచం పట్టినట్టు ఆ అద్దంలో ప్రత్యక్షంగా అగపడింది!

క్షణమైనా అలస్యం చేయకుండా, పెద్దవాడు కొన్నటువంటి తివాసీ యెక్కి ముగ్గురూ కోటలో వాలారు. మూడవవాడు గబగబా తనదగ్గిర వున్న మామిడి

పండు తీసి తండ్రికి వాసన చూపించాడు. రాజుగారి జబ్బు చిటికలో నయమైపోయి, ఆయన గభీమని లేచి కూర్చున్నాడు. అందరూ ఆశ్చర్యపడటమే కాదు, ఎంతగానో సంతోషించారు.

ఇక్కడికి బాగానేవుంది. కానైతే, రాజుకి పట్టుకున్న సమస్యమాత్రం అప్పటికీ యిప్పటికీ తేలనేలేదు. కొడుకులు తీసుకువచ్చిన వస్తువులు దేనిమట్టుకి అదే వింతయినదీ విలవయినదిన్నీ. మూడు వస్తువులూ గొప్పవే, మూడూ చిత్రమయినవే. వాటిల్లో ఇది ఎక్కువ, అది తక్కువ అని పోల్చి చెప్పటానికి వీలే కనపడదు. మూడు వస్తువులూ ఒక్కమారుగా కలిసిరావటం చేతనే రాజు ప్రాణాలు దక్కినాయి. అందులో ఏ పక్కటి లేకపోయినా, మాట దక్కకపోను.

అందుకనే రాజుగారికి ఆలోచన తెగటంలేదు. ఇంకా యిప్పటికీ, దర్బారులు చేస్తూనేవున్నారు. సభలో పెద్దపెద్దల్ని సల




హాలు అడుగుతూనేవున్నారు. సమాధానం చెప్పటానికి ఎవళ్ళవల్లా కాకుండావుంది. చివరకు ఏమన్నారో తెలుసా రాజుగారు? —'బాలవాక్యం బ్రహ్మవాక్యం.' చందమామ చదివే పాపాయిలు రాజ్యం ఎవడికి ఇవ్వమంటే వాడికేనా రాజ్యం ఇవ్వదలుచుకున్నాను—అని చెప్పారు. కనుక, రాజకుమారులు ముగ్గురిలో ఎవరికి రాజ్యం ఇవ్వాలో మీరు నిర్ణయించి, ఇచ్చివెయ్యండి. లేకపోతే వాళ్లు పాపం కొట్టుకుంటారు.




ఆయనకు ఒక మూరెడుపొడుగు గడ్డం ఉన్నది. అవును, గడ్డం ఉన్నదికదా అని చెప్పి, ఆయన ఋషీశ్వరు డనుకుంటున్నారా? కాదు. ఆయనొక సాయిబు.

అయితే, సాయిబుకి నిండా అరవై ఏళ్లు ఉండటంచేత, తలా గడ్డం కూడా తెల్లగా నెరిసిపోయి, జనపనారని మరిపిస్తున్నాయి.

మన సాయిబుకి తన గడ్డంమీద ఎంతో ప్రేమ. ఆ గడ్డానికి నిగనిగలాడే నల్లటి రంగు వేయటం, నూనె రాయటం, షోగ్గా దువ్వటం- ఆయనకు ఎంతసేపూ గడ్డం మీదనే మోజు కాని, తలనిగురించి తగినంత శ్రద్ధలేదు. అంచేత, గడ్డంమాత్రం నల్లగా నిగనిగలాడుతూ వుంది. తలమాత్రం తెల్లగానే వుండిపోయింది.

ఆవూళ్లో కొంటెకుర్రవాళ్లు కొంతమంది సాయిబుగారి వాలకమంతా కనిపెట్టుతునే వున్నారు. ఆయన్ని ఎట్లాగయినా ఎగతాళి చేసి, టాటాకులు కడదామని వాళ్ళలో వాళ్లు నిశ్చయించుకున్నారు.

ఒకనాడు వాళ్లు వచ్చి, సాయిబుగారి చుట్టూ మూగారు. ఆ సమయానికి సరిగ్గా ఆయన, ఉక్క బోస్తుందికదా అని నెత్తిమీది టోపీ తీసి కింద ఉంచాడు.

కుర్రవాళ్లు అమట్టున సాయిబుగారిని అడిగారు: "ఏమండి సాయిబుగారూ!— మా కొక సందేహం వచ్చింది. మీ తల యావత్తూ ముగ్గుబుట్టలాగ తయారయింది కదా, మరి గడ్డంమాత్రం అంత నల్లగా వున్నదేమండీ?" అన్నారు.

ఈ ప్రశ్నకి సాయిబుగారు మండిపడతారని ఆ ఆకతాయికుర్రాళ్ల ఉద్దేశం. వాళ్లు అనుకున్నట్టు ఆయనకు ఎంతమాత్రం కోపం రాలేదు. సాయిబుగారు చిరునవ్వు నవ్వుతూ నిదానంగా యిలా చెప్పాడు:—

"అబ్బాయిలూ! ఇందులో ఆశ్చర్యం ఏమిటుంది? తలవెంట్రుకలకంటె గడ్డం వెంట్రుకలు ఇరవై సంవత్సరాలు చిన్నవి. అందుకనే అవి నెరిసిపోయినాయి, ఇవి నల్లగా వున్నాయి..." అని.

సాయిబు చెప్పిన యీ సమాధానం విని కుర్రవాళ్లు సిగ్గుపడ్డారు.

ఉదర రాధ, అయితానగర్, తెనాలి — టి. అప్పారాయవర్మ, విజయవాడ.

## ముగ్గులు



పి. వనజాక్షి, మద్రాసు



జె. అన్నపూర్ణాదేవి, ఏలూరు

# చందమామ పజిల్

(భాషాభివృద్ధికి)

## ఆధారములు

**అడ్డము :**

1. నీటిమీద ప్రయాణం చేస్తుంది
3. నీటిలోనూ, నేలమీద బ్రతుకగలదు
5. మనుష్యులు
7. తగ్గిపోవుట
9. నివసించే చోటు
11. అడది
12. త్రాగుట
14. సంతోషము
16. ఒక తిథి
17. విషజంతువు
18. దూషణ




**నిలువు :**

2. అడవి
3. నీటిలో పుట్టే పువ్వు
4. ఒక పెద్ద సంఖ్య
6. వానరము
8. ఒక నది
10. ఒక కొండజాతి
11. అడది
12. నాలుగో వంతు
13. సంతోషము
14. సంఘము
15. దండయాత్ర

# వీరబల్ వినోదాలు



ఒకప్పుడు అక్బరుపాదుషా ఇట్లా ఆజ్ఞాపించాడు: "వీరబల్! మేలుమరిచే జంతువునీ, మేలు మరవని జంతువునీ—ఈ రెండింటినీ తీసుకువచ్చి రేపటిరోజున మా యెదట పెట్టాలి" అంటూ.

ఎంత ఆలోచించినా వీరబల్‌కు ఏం పాలుపోయిందికాదు. పాదుషా ఉగ్రుడైనాడు. "రేపు సాయంత్రంవరకు గడువిస్తున్నాము. మేంచెప్పిన రెండు జంతువుల్నీ ఎదట పెడితే సరేసరి, లేని పక్షమందు తలకొట్టి కోటగుమ్మానికి వేలాడదీయిస్తా"మని ప్రకటించాడు.

ఈ ప్రకటన విని, దర్బారులో యావన్మందీ వణికిపొయ్యారన్నమాట. ఏమంటే, పాదుషా అంత తీవ్రంగా చెప్పినాడాయిరి. వీరబలుడి శత్రువర్గమంతా 'భేష్—వీరబలుడు ఈమారు సమాధానం చెప్పకోవడం పట్టిమాట. తప్పకుండా, తలకొట్టివేయటమే జరుగుతుంది. మనకి పీడ వదుల్తుంది' అని చెప్పి భుజాలు ఎగరవేశారు. ఏం జరగబోతుందో భగవంతుడా అనుకుంటూ సభలో అందరూ కలవరపడుతున్నారు. ఈ స్థితిలో దర్బారు చాలించారు. ఎవళ్ల ఇళ్లకు వాళ్లు వెళ్లారు.

వీరబలుడు ఇల్లు చేరుకున్నాడన్నమాటేగాని, నిజానికి మతిలేదు. మొహం వేలవేశాడు. తండ్రి విచారంగా ఉండటం కనిపెట్టింది వీరబలుడి కూతురు. వీరబలుడి కూతురంటే సామాన్యురాలుకాదు. బుద్ధిబలంలో తండ్రిని మించిన తనయ. ఇహ దాపరిక మెందుకూ? తన మనసులో పట్టుకున్న బెంగకు కారణం వెల్లడించేశాడు వీరబలుడు.

"నాన్నారూ! ఈపాటిదానికేనా ఇంత బెంగ? మీరేమీ దిగులుపడకండి. రేపు పొద్దుటికల్లా జవాబు చెప్పే పూచీ నాది. హాయిగా వుండండి మీరు," అని వీరబలుడుకి కూతురు ధైర్యం చెప్పింది.

కూతురి చాతుర్యం వీరబలుడికి తెలుసు. ఇదివరకు ఎన్నోసార్లు ఇటువంటి గండాలు తప్పించింది. అందుకోసం, ఆమె ధైర్యం చెప్పగానే అతడికి ఎక్కడి బెంగ అక్కడనే వదిలిపోయింది.

'దా ము'



మర్నాడు వీరబల్ దర్బారుకు హాజరు కావాలి. కూతురు ఉపాయం చెప్పింది – తనతోకూడా అల్లుడినీ ఒక కుక్కనూ వెంటబెట్టుకు వెళ్లమని. అల్లాగే చేశాడు వీరబలుడు.

వీరబల్ దర్బారుకుపోగానే అందరూ గొల్లుమని నవ్వారు ఎగతాళిగా. ఆ కుక్కా వేషమూ చూచి, వీరబలుడికి ఏమాత్రమో మతి చలించిందనుకున్నారు వాళ్లు.

అతి వినయంగా వంగి వీరబలుడు సలామ్ చేశాడు ఫాదుషాకు.

"ఇవిగో దేవరా, తాము కోరిన రెండు జంతువులూ!" అని విన్నవించాడు వీరబలుడు.

"ప్రభువులనే పరిహాసం చేస్తున్నావుటోయి వీరబల్!" అని గద్దించాడు ఫాదుషా.

"ఎంతమాత్రమూ పరిహాసం కాదు ప్రభూ! నేను మనవిచేసుకునే రెండు ముక్కలు ఆలకించాలి ప్రభువులు: తాము కోరిన రెండు జంతువుల్లోనూ ఇదుగో, మా అల్లుడుగా రొకరు. ఈయనకి కనకాభిషేకం చేయించినా, తృప్తి అనేది లేదు. ఎప్పటి మేలు అప్పుడే పరగడుపు! ఇక– కృతజ్ఞత అనే సుగుణం ఈ శునకంలో మూర్తీభవించివున్నది. పిడుగులు పడుతున్నా సరే, ప్రాణం పోతున్నాసరే లెక్క చేయక యజమాని అండనే వుంటుంది" అని జవాబు చెప్పాడు వీరబలుడు.

"మేలు మరిచే జంతువులు మన ఆస్థానంలో ఉండటం నా కిష్టంలేదు. కనుక, మీ అల్లుడిగారిని తల తీయించివేస్తాము" అని వీరబలుడితో అన్నాడు ఫాదుషా.

తడుముకోకుండా తక్షణమే చెప్పాడు వీరబలుడు: "మహాప్రభూ! చాలా బాగున్నది ఏలినవారి ఆజ్ఞ! అయితే, మనమూ ఒక యింటి అల్లుళ్ళమేనన్న సంగతి మరిచారేమో ప్రభువులు. తమ ఆజ్ఞ, మన ఉభయులకూ వర్తిస్తుంది..."

ఈ జవాబుకి ఫాదుషా సిగ్గుపడి, వీరబలుడికి కోకొల్లలుగా బహుమానా లిచ్చి సత్కరించాడు.



# జోలపాటలు

[సంపాదన : దీవి భానుమతీదేవి]

కలువరేకులతల్లి కన్నుల్లు చూచి
కలికిచందమామ కానరాడాయె
మరునాడు అమ్మాయి మాటల్లు చూచి
మాణిక్యములతోను పాడిచెనూర్యుండు

అమ్మాయి నెవ్వారే కొట్టిన్నవారు
కొట్టి కొబ్బరిబెల్లం చేతికిచ్చారు
పమిడిగొలుసులతోటి వెండివుయ్యాల
వరలక్ష్మి వూపవే వుయ్యాల తొట్టె.

గాజుల్లసెట్టి ఓ కనకాలసెట్టి
తేవోయి అమ్మాయికి తేనె గాజుల్లు.
తేనెగాజులసెట్టి రతనాలసెట్టి
రావోయి మావాడ రతనాలతోను.

కస్తూరి బొట్టెట్టి కంచిపట్టుచీర గట్టి
అటుకులు వడిగట్టి ఆడి రమ్మందు.
ఆడబోయిన చోట మాడ దొరికింది
మాడకును చేయింతు మద్దికాయుల్లు.

రాలేద మాబాల మిముగూడి యాడ?
మాబాల నెందైన కంటిరా మీరు?
అమ్మ! మీబాలకు ఆనవాలేమి?
అడిగితే యెవరైన చెప్పనేలేదా ?

జడజడా రత్నాలు జడరావిరేకు
పాపట పన్నీరు నొసట కస్తూరి
మెడనిండ ముత్యాల హారాలతోడ
కలువరేకులతల్లి కనుపించలేద ?

# పాపాయి

[రచన : 'ప్రయాగ']

పాపాయి మా యింట వెలసినాడమ్మ
వెలసి యింటను వెలుగు నింపినాడమ్మ
నింపి భాగ్యాలు పండించినాడమ్మ
పండించి నరకంబు బాపినాడమ్మ.

★

పా త్తిళ్లపాపాయి పలుకరించాడు
పందిట్లొ మా ఆవు 'అంబా' యటంది
పైడిగిన్నెలొ పాలు పోసి తేరమ్మ
పైనుండి జాబిల్లి పొంచి చూస్తోంది.

★

వాగీసుడే విద్య చెప్పిపోతాడు
నారదుండే పాట నేర్పిపోతాడు
తారలుండేదాక ధరణి వర్ధిల్లి
తెలుగుతల్లికి ఋణము తీర్చుకుంటాడు.

---

పజిలుకు జవాబు





పాపలూ !

వీడు ఒక దొంగపిల్లవాడు. వూళ్లో ఉన్న మూడు ఇళ్ళలోనూ దొంగ తనం చేయాలని వాడి వుద్దేశం. కానైతే, ఒక్క యింట్లో మాత్రమే వాడు ప్రవేశింపగలడు. తక్కిన రెండు ఇళ్ళలోకి పోవటానికే సాధ్యం కాదు. వాడు ప్రవేశించటానికి వీలయిన యిల్లు యేదో కనుక్కోండి.

---

**16-వ పేజీలోని చిక్కు బొమ్మలకి జవాబు:**

**3, 4** నెంబర్లుగల పిల్లులు రెండు తేడాగా ఉన్నయ్.

# యువ ప్రచురణలు

మా ప్రచురణలు అన్ని హిగిన్‌బాథమ్సు బుక్ స్టాల్సులోనూ దొరుకుతవి. లేదా మాకు వ్రాయండి. ఒకేసారిగా **6-0-0** పుస్తకాలు తెప్పించినవారికి పోస్టు ఖర్చులు మేమే భరించెదము.

## శరత్‌బాబు రచనలు

| | | | |
|---|---|---|---|
| వాగ్దత్త | [నవల] | 1 | 12 |
| సుభద | .. | 1 | 8 |
| దేవదాసు | .. | 1 | 8 |
| పల్లీయులు | .. | 1 | 8 |
| నవవిధాన్ | .. | 1 | 0 |
| చంద్రనాథ్ | .. | 1 | 0 |
| పరిణీత | .. | 0 | 12 |
| బడదీదీ | .. | 0 | 12 |
| పతివ్రత | .. | 0 | 12 |
| హేమాంగిని | .. | 0 | 12 |
| విస్మృతి | .. | 0 | 12 |
| మావారు | .. | 0 | 12 |
| కాశీనాథ్ | .. | 0 | 12 |
| మహేశుడు | [కథలు] | 0 | 12 |
| నారీర్ మూల్య | [వ్యాసం] | 0 | 12 |

## డిటెక్టివు నవలలు

| | | | |
|---|---|---|---|
| కదపటిమాట | [రాధాకృష్ణ] | 0 | 12 |
| మాయమైన మణిహారం | .. | 0 | 12 |
| తప్పిపోయిన పెళ్లికూతురు | .. | 0 | 12 |
| తగినశాస్తి | .. | 0 | 12 |
| పారిపోయిన యుద్ధఖైదీ | .. | 0 | 12 |
| దివాలా ఎస్టేట్ | .. | 0 | 12 |
| అంతులేని ఆశ | .. | 0 | 12 |

## చక్రపాణి అనువాదాలు

| | | | |
|---|---|---|---|
| నారీద్వేషి [మైత్రా] | అనువాదం కథలు | 1 | 8 |
| పరాజయం | .. .. .. | 0 | 12 |
| ఉదరనిమిత్తం | [నాటకం] | 1 | 0 |
| వల్లభపురం చిట్టడవిలో | [రాయ్‌చౌధరి] | 0 | 12 |
| హనుమంతుని స్వప్నం | [పరశురాం] | 0 | 12 |
| మెట్టవేదాంతం | [వనఫూల్] | 1 | 0 |
| బెంగాలీకథలు | [మనోవైజ్ఞానిక కథలు] | 0 | 12 |
| ప్రగల్భప్రేతము | [అత్యుత్తమ కథలు] | 0 | 12 |
| పాంచజన్యం | [రాజకీయ కథలు] | 0 | 12 |
| డిటెక్టివు | [నాటకం] | 0 | 12 |
| అంబికర్త | [పరశురాం కథలు] | 1 | 0 |
| సంధి | [యతీంద్ర మోహనసింహా] | 1 | 12 |

## కుటుంబరావు రచనలు

| | | | |
|---|---|---|---|
| విలవసీదు | [అత్యుత్తమ కథలు] | 1 | 8 |
| మొండివాడు | .. | 1 | 0 |
| కాలక్షేపం | .. | 0 | 12 |
| వరప్రసాదం | .. | 0 | 12 |
| కవిరాట్టు | [గల్పికలు] | 0 | 12 |
| కులంలేని మనిషి | [నవల] | 0 | 12 |
| అరుణోదయం | .. | 1 | 0 |
| మారుపేర్లు | .. | 0 | 12 |
| నీకేం కావాలి? | .. | 0 | 12 |
| ప్రణయరోగులు | [నాటకం] | 1 | 0 |
| ఆరితేరిన ఘటం | (విదేశ కథలు) | 0 | 12 |
| రష్యన్ కథలు | | 0 | 12 |

## చలంగారి రచనలు:

| | | |
|---|---|---|
| శ్రీ | | 2- 0-0 |
| ప్రేమలేఖలు I | | 1-12-0 |
| ప్రేమలేఖలు II | | 1- 8-0 |
| బిడ్డలశిక్షణ | | 1- 8-0 |
| విషాదం | | 1- 0-0 |
| ఆనందం | | 1- 0-0 |
| చిత్రాంగి | [నాటకం] | 1- 8-0 |
| త్యాగం | ,, | 1- 8-0 |
| మంగమ్మ | ,, | 1- 0-0 |
| జయదేవ | ,, | 1- 0-0 |
| శశాంక | ,, | 1- 0-0 |
| సావిత్రి | ,, | 0-12-0 |
| సత్యం, శివం, సుందరం | | 1- 4-0 |
| నాటికాగుచ్ఛం | | 1- 4-0 |
| ఖర్మమిట్లా కాలింది | [కథలు] | 1- 8-0 |
| కన్నీటికాలువ | ,, | 0-12-0 |
| పాపం !!! | ,, | 0-12-0 |
| దైవమిచ్చిన భార్య | [నవల] | 1- 8-0 |
| మైదానం | ,, | 1- 0-0 |
| అమీనా | ,, | 1- 0-0 |
| వివాహం | ,, | 1 -0-0 |
| బ్రాహ్మణీకం | ,, | 0-12-0 |
| అరుణ | ,, | 0-12-0 |
| హంపీకన్యలు | ,, | 0-12-0 |
| అదృష్టం | ,, | 1- 0-0 |
| వాళ్ళు నలుగురూ | ,, | 0-12-0 |
| పురూరవ | నాటకం | 1- 8-0 |

## వివిధ రచయితలు

| | | | |
|---|---|---|---|
| ఈస్ట్‌లిన్ | [నవల] | | 2- 0-0 |
| చచ్చిపోయిన మనిషి | [పద్మరాజు] | నవల | 0-12-0 |
| కదంబం | [నార్ల] | | 0-12-0 |
| పొగడదండ | [కొ. పద్మావతి] | కథలు | 0-12-0 |
| రూం-టు-లెట్ | [బాలకృష్ణశాస్త్రి] | ,, | 0-12-0 |
| సిపాయికథలు | [శిష్ట్లా] | ,, | 0-13-0 |
| మూగజీవాలు | [గోఖలే] | ,, | 1- 4-0 |
| రాజా-మంత్రి | [యం. యస్. మూర్తి] | | 0-12-0 |
| దుక్కాలూ గీతలూ | ,, | ,, | 1- 0-0 |
| హర్ హైనెస్ | | | 1- 0-0 |
| పలితకేశము | [దువ్వూరి] | కావ్యం | 1- 0-0 |
| స్వప్నవాసవదత్తము | [కాటూరి] | నాటకం | 0-12-0 |
| సెలవు | [కప్పగంతుల] | | 1- 0-0 |
| ఋణవిముక్తి | ,, | | 1- 0-0 |
| సంజీవి | [ధనికొండ] | కథలు | 1- 0-0 |
| గర్వభంగం | ,, | ,, | 1- 0-0 |
| ప్రియురాలు | ,, | ,, | 1- 0-0 |
| తీర్పు | ,, | కథలు-నాటికలు | 0-12-0 |
| పవిత్రులు | ,, | దృశ్యనాటిక | 1- 4-0 |
| ఎర్రబుట్టలు | ,, | దృశ్యనాటికలు | 1- 8-0 |
| కళ్యాణి | [సోమంచియజ్ఞన్నశాస్త్రి] | నాటకం | 0-12-0 |
| విశ్వంపెళ్ళి | ,, | ,, | 0-12-0 |
| జ్యోతిర్మయి | [అ. వెం. నర్సు] | ,, | 1- 0-0 |

## యువ బుక్ డిపో

పోస్టుబాక్సు నెంబరు, 1686, మద్రాసు.



Printed and Published by B.N. REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras
Editors: CHAKRAPANI and K RAJA RAO

